# ఆంధ్రపత్రిక

## తొమ్మిదవ సంవత్సరాదిసంచిక

ఇందు

స్వరాజ్యసమస్యలు భాషావాఙ్మయచర్చలు

విశేషాంశములు



మహాజనులచే వ్రాయఁబడిన అమూల్యవ్యాసములును అనేకచిత్రపటములును గలవు

త్రికా ముద్రాలయమున ముద్రితము : ఆంధ్రపత్రికాధిపతిచే ప్రకటితము

6-7, తంబుసెట్టి వీథి, జార్జి టవును, మదరాసు

1918-వ సంవత్సరము మే నెల 1-వ తేది

శ్రీ రస్తు

శ్రీ మహిషాసురమర్దిన్యై నమః

# కాళయుక్తినామ సంవత్సర సిద్ధాన్త పంచాఙ్గమ్

శ్లో. శ్రీకల్యాణ గుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యం నృణాం, ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.
శ్రీమద్వింధ్యాచలమందిరాం మహిషాసుర మర్దినీం, జగతాం మాతరం నిత్యం నిర్వృత్యై వా ముపాస్మహే.







ఈ పంచాంగము
మహారాజరాజశ్రీ శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్రమౌళీశ్వర ప్రసాద్ బహదర్ మన్నె సుల్తాన్
చింతలపాటి వంటు జమీందార్ సర్ దేశముఖ్ మన్నె వార్ సర్కార్ ముస్తాజాన్నగర్
వగైరా దొరవారి సంస్థాన పండితులైన

## పురాణం రామచంద్రశాస్త్రిచే

గుణింపబడి

బ్రహ్మశ్రీ, పురాణం - రామకృష్ణ శాస్త్రిగారిచే పరిష్కరింపబడి


ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.


ఫలితాంశము:— ఈ సంవత్సరము రాజు శుక్రుడు, మంత్రి శని, సేనాధిపతి శుక్రుడు, సస్యాధిపతి కుజుడు, ధాన్యాధిపతి సూర్యుడు, అర్ఘాధిపతి శుక్రుడు, మేఘాధిపతి శుక్రుడు, రసాధిపతి బృహస్పతి, నీరసాధిపతి చంద్రుడు, నాలుగు దూముల వర్షము. పూర్వసస్యములు చక్కగా ఫలించును. కందులు శెనగలు మొదలగు రక్తధాన్యములు రక్తభూములు తెల్లధాన్యములు బాగుగ ఫలించును. తేనె నెయ్యి మొదలగు రసద్రవ్యములకు ధరలు హెచ్చగుచుండును. చైత్రమున కొంచెముగ వర్షించును. వైశాఖమున యెండలు తీక్ష్ణముగ నుండును. ఆహారధాన్యములు దుర్లభము లగును. జ్యేష్ఠమున పశ్చిమవాయువులచే ఉష్ణబాధ కలుగును. కాని యచ్చటచ్చట వర్షములు ప్రారంభించి భూమి చల్లబడును. ఆషాఢమున ఖండవృష్టి. శ్రావణ భాద్రపదములయందు చక్కగా వర్షించును. ఆశ్వయుజ కార్తీక మాసములయందును సస్యోపయోగ మగునట్లు చక్కగా వర్షించును. పశునాయకుడు గోపాలుడగుటచే పశువులు అభివృద్ధి కలిగి వర్ధిల్లును. జ్యేష్ఠ శు 3 భౌమవాసరమున సరస్వతీనదీ పుష్కరప్రవేశము కలుగును. రాత్రావృష్టి గావున సుభిక్షముగ నుండును. పంటలు పదివీసములకధికముగ ఫలించును.

రాజా శుక్రః — మంత్రీ శనిః
సేనాధిప శ్శుక్రః — సస్యాధిపః కుజః
ధాన్యాధిప స్సూర్యః — అర్ఘాధిప శ్శుక్రః
మేఘాధిప శ్శుక్రః — రసాధిపో గురుః
నీరసాధిప శ్చంద్రః.

### ద్రోణనామకో మేఘః.

మేరోః ప్రాగ్దిగ్భాగే మేఘ స్యోత్పత్తిః. మేఘఫలం. శ్లో. నిరంతరం మహావర్షం మధ్యదేశే తథైవచ, అనుక్షణం సస్యలోకానాం ద్రోణమేఘస్య లక్షణం.

### చతురాఢకపరిమితం వర్షం.

ఆఢకప్రమాణం. శ్లో. షష్టియోజన విస్తీర్ణం శతయోజన మాయతం, ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే. దశభాగా స్సముద్రేషు భూధరేషుచ సప్తచ, ద్వౌ భాగౌ భువి వర్షస్య ఏతంవర్షస్య లక్షణం.

### వర్ష ధాన్యాదయః.

వర్షం ౧౯ ధాన్యం ౧౫ శీతం ౧౧ తృణం ౧౫ ఉష్ణం ౨ మారుతం ౨ ప్రజావృద్ధిః ౧౫ నాశః ౧౫ రాజవిద్వేషం ౧౧ ఉగ్రం ౫ పుణ్యం ౫ పాపం ౫ వ్యాధయః ౧౧ వ్యాధ్యుపశమనం ౨ ఆచారః ౧౧ అనాచారః ౧౧ జన్మాని ౧౧ నాశః ౧౫ దేశోపప్లవః ౯ దేశస్వాస్థ్యం ౧౩ చోరభయం ౧౩ నాశః ౧౧ అగ్నిభయం ౯ అగ్నిశాంతిః ౯ మృగోపద్రవః ౧౩ మృగక్షయః ౫ కీటకభయం ౮౧ కీటకక్షయః ౧౧ మూషకవృద్ధిః ౯ నాశః ౧౨ సర్పభయం ౧౯ సర్పక్షయః ౧౫ కామః ౫ లోభః ౨ మోహః ౫ మదః ౧౨ మాత్సర్యం ౯ సుఖం ౧౫ దుఃఖం ౧౯ శోకః ౩ వివాదం ౧౯ మనోవేదనా ౧౨ క్షేమః ౧౩ ప్రతిష్ఠా ౨ అప్రతిష్ఠా ౧౨ దుర్భిక్షం ౯ మత్తతా ౧౨ పురుషోత్పత్తిః ౨ స్త్రియః ౧౩ ధాతుర్వాదః ౧౯ భయం ౨ శౌర్యం ౧౧ దుష్టనిగ్రహః ౧౫ శిష్టానుపాలనం ౧౯ సత్యం ౫ అసత్యం ౨ విశ్వాసః ౯ అవిశ్వాసః ౧౧ దయాళుత్వం ౧౩ నిర్దయాళుత్వం ౧౫ న్యాయం ౧౨ అన్యాయం ౧౯ జ్ఞానం ౧ అజ్ఞానం ౧౩ కాపట్యం ౧ నిష్కాపట్యం ౯ ధార్మికం ౧౨ అధార్మికం ౧ గోమాయువృద్ధిః ౧౦ నాశః ౨ సస్యకీటకవృద్ధిః ౪ నాశః ౫ శలభవృద్ధిః ౧౩ నాశః ౪ మశకవృద్ధిః ౧ నాశః ౧౦ మత్కుణవృద్ధిః ౧ నాశః ౧౩ వృశ్చిక వృద్ధిః ౧ నాశః ౧౦ సస్యకీటకవృద్ధిః ౬ నాశః ౬ పశువృద్ధిః ౨ నాశః ౭ శుకవృద్ధిః ౬ నాశః ౫ ద్రుమకీటక వృద్ధిః ౭ నాశః ౭ క్షుధా ౧ తృష్ణా ౩ నిద్రా ౨ ఆలస్యం ౧ ఉద్యోగః ౧ శాంతం ౧ క్రోధః ౯ డంబం ౯ మిత్రభేదః ౨ మైత్రి ౫ రసనిష్పత్తిః ౨ ఫలనిష్పత్తిః ౧౧ ధేనువృద్ధిః ౧ నాశః ౫ మహిషవృద్ధిః ౪ నాశః ౮ మృగవృద్ధిః ౧ నాశః ౮ ఛాగవృద్ధిః ౧ నాశః ౪ అశ్వవృద్ధిః ౫ నాశః ౪ గజవృద్ధిః ౪ నాశః ౮ ఉష్ట్రవృద్ధిః ౩ నాశః ౮ విప్రవృద్ధిః ౮ నాశః ౧ క్షత్రియ వృద్ధిః ౧ నాశః ౪ వైశ్యవృద్ధిః ౮ నాశః ౫ శూద్రవృద్ధిః ౫ నాశః ౮ మ్లేచ్ఛవృద్ధిః ౧ నాశః ౩ సంకరవృద్ధిః ౪ నాశః ౪ మరకతవృద్ధిః ౩ మాణిక్యవృద్ధిః ౧ వజ్రవృద్ధిః ౩ వైడూర్యవృద్ధిః ౫ గోమేధికవృద్ధిః ౮ పుష్యరాగవృద్ధిః ౩ ఇంద్రనీలవృద్ధిః ౪ ప్రవాళవృద్ధిః ౫ మౌక్తికవృద్ధిః ౪ ఇతరరత్నవృద్ధిః ౫ సువర్ణవృద్ధిః ౧౪ రజతవృద్ధిః ౧౦ తామ్రవృద్ధిః ౬ కాంస్యవృద్ధిః ౧౦ లోహవృద్ధిః ౮ అయోవృద్ధిః ౭ త్రపువృద్ధి ౧౦ సీసవృద్ధిః ౧౦ రసవృద్ధిః ౬ వ్రీహివృద్ధిః ౧౪ శాలివృద్ధిః ౮ సుగంధవృద్ధిః ౮ తిలవృద్ధిః ౧౮ మాషవృద్ధిః ౬ ముద్గవృద్ధిః ౭ సర్షపవృద్ధిః ౪ చణకవృద్ధిః ౮ ఆఢకవృద్ధిః ౧౮ గోధూమవృద్ధిః ౧౮ కోద్రవవృద్ధిః ౮

### అర్ఘాధిపస్య శుక్రస్య ఫలం.

శ్లో॥ అర్ఘాధిపే యదా శుక్రే సర్వధాన్యార్ఘ వృష్టికృత్, శ్వేతధాన్యం సుఫలితం సుభిక్షం స్యాద్వసు భూతలే. ఇదం ఫలం సర్వదేశేషు ప్రశస్తం.

### మేఘాధిపస్య శుక్రస్య ఫలం.

శ్లో॥ అతివృష్టి స్సుభిక్షంచ సస్యవృద్ధి ర్నిరామయం, క్షీరప్రదా స్సదా గావః శుక్రే మేఘాధిపే సతి, ఇదం ఫలం సర్వదేశేషు ప్రశస్తం.

### రసాధిపస్య గురోః ఫలం.

శ్లో॥ తిల తైలగుడక్షౌద్రా యేచాన్యే మధురాదయః, అర్ఘవృద్ధిః ప్రజానాంచ జీవే యది రసాధిపే. ఇదం ఫలం కొంకణ మాగధ దేశయోః ప్రశస్తం.

### నీరసాధిపస్య చంద్రస్య ఫలం.

శ్లో॥ ముక్తాఫలం రత్న సువర్ణబీజం కాంస్యాది వస్త్రాదిధనంచ సర్వం, వృద్ధిం గతం స్యాద్బహుధనం హి లోకే చంద్రో యదా నీరసనాయకో భవేత్. ఇదం ఫలం మాళవదేశే ప్రశస్తం.

### రవేరార్ద్రా ప్రవేశకాలస్య ఫలం.

ఏతత్సంవత్సర జ్యేష్ఠ శు ౧౨ శుక్రవాసరే త్రయోదశి ఘటికా స్వాత్యాధా నక్షత్రే సాధ్య నామయోగే కౌలవకరణే సూర్యోదయాది ౪౧-౧౪ ఘటికా భోగసమయే రవేరార్ద్రా ప్రవేశాత్ తత్కాలతిథ్యాదీనాం ఫలాని. శ్లో॥ రాత్రౌ సస్యాభివృద్ధిః స్యాత్ త్రయోదశ్యాం జయప్రదం, శుక్రే కాంతికరం ప్రోక్తం మైత్రే స్వాతీనాం శుభం భవేత్. సాధ్యే పూర్ణఫలం ప్రోక్తం కౌలవేతు సుభిక్షకృత్, రవే రార్ద్రా ప్రవేశేతు కాలతిథ్యాదిజం ఫలం.

### భరణ్యాది మణ్డల గత చంద్ర ఫలం.

మహాగ్నః.

ఇదం ఫల మాంధ్రదేశే ప్రశస్తం.

### మేష సంక్రాంతి ఫలం.

ఏతత్సంవత్సర చైత్ర శు ౩ శనివాసరే దివా రవేర్మేష ప్రవేశాత్ ఫలం. శ్లో॥ దివాచే న్మేష సంక్రాంతి రనర్ఘ కలహప్రదా, అపరాహ్ణే లోక పీడా శనివారే ల్పవృష్టికృత్, రవే ర్మేష ప్రవేశేతు కాలతిథ్యాదిజం ఫలం. ఇదం ఫలం ద్రావిడ గౌడదేశయోః ప్రశస్తం.

## సురతి ద్రావకము

సీసా 1-కి వెల రూ. 1-0-0 వి. పి. రూ. 1-4-0.

మూత్రద్వారమునుండి నిమ్మద్రవము మూత్రనాళము వరకు పోయి అక్కడ చిన్నపుండు అగుటవలన శగరోగము ఏర్పడును. ఇది అంటురోగము. ఒకరివలన మరి ఒకరికి ఏర్పడును. దీనివలన సంతానము కలుగుటకు భంగము రావచ్చును. దీని ముఖ్యలక్షణములు:

మూత్రము విడుచునపుడు పోట్లు మంటలు; మూత్రద్వారము నుండి తెల్లటిగాని, ఎర్రటిగాని, పచ్చటిగాని, చీమువంటి ద్రవము వెడలుట, పాత్రికపై మరకలు మిగిలియుండుట; మూత్రకోశమున పోట్లు, తరుచుగా మూత్రవిసర్జనము చేయుట, మూత్రము బొట్లుబొట్లుగా వెడలుట మొదలగునవి. రోగము ప్రారంభించిన వెంటనే సురతిద్రావకము ఏడు పూటలు సేవించిన నాళముదగ్గర పుండుమాని చీమువంటిద్రవము కట్టి మూత్రము ధారాళముగా వెడలును నాళములయందలి జిల మానును. ఈ ద్రావకము పాతశగరోగములకూడ నతిత్వరలో మాన్పును. రోగము త్వరలో పూర్తిగ కుదురుటకు మూత్రమార్గమును శుద్ధముగా నుంచవలయును. అందులకు గాను ఆమార్గము పిచికారుపెట్టి కడుగుట యుక్తము. కోరువారలకు పిచికారును అందులకు ఉపయోగించుమందును రూ. 0-8-0 లకు పంపబడును.

ఈమందు కోరుకొని పురుషులైనను స్త్రీలైనను, ఎంతకాలమునుండి బాధపడుచున్న రోగులయినను వ్రాయవలయును. మందు వైద్యుని వలెబెట్టి మాన్పజేసుకొనవలసియుండును.

శగరోగము తగిలినవారు జాడ్యము నయమగువరకు స్త్రీసాంగత్యమును అట్టిపిలంపులను మాని విశ్రాంతి గలిగి యుండవలయును.

## జీర్ణ రసాయనము

25 మాత్రల డబ్బీ వెల రూ. 1-4-0.



అజీర్ణమువలన భుజించిన వస్తువులు రక్తమువలె సరిగా మారవు. అజీర్ణము మిగిలిన రోగములకు కారణము. దీనివలన జీర్ణకోశము లందు రసస్రావము క్రమముగ కలుగక దుర్బల మేర్పడి ఆయువు క్షీణించును.

1. ఆకలి లేకపోవుట, 2. అగ్నిమాంద్యము, 3. మలబద్ధము, 4. కడుపుపోటులు, 5. అరుచి, పుల్లత్రేపులు, 6. వికారము, గుండెలలోను రొమ్ములోను మంట, బరువు, 7. తలనొప్పి, తలదిమ్ము, 8. చిక్కిపోవుట, 9. జ్వరము, 10. చిన్నపూస మీదను ప్రక్కను గూళ్లలోను పోటు, ఆయాసము మొదలగునవి. ఈ గుణములన్నియు నొకసారియే కనబడకున్నను అజీర్ణము వీటికి ప్రధానకారణము. అజీర్ణలక్షణములు కనుపించిన వెంటనే జీర్ణరసాయనము మాత్రలను సేవించిన జీర్ణశక్తి హెచ్చును, మలబద్ధము మానును. రక్తము వృద్ధిచెందును. ఆకలి హెచ్చును.

చిరునామా:— అమృతాంజనము డిపో,

బొంబాయి లేక మద్రాసు.

## గురుచార ఫలం.

ఆర్ద్రాది వృషభరాశిస్థిత గురు ఫలం. శ్లో॥ వృషరాశిగతే జీవే పశు స్త్రీ శిశు నాశనం, మధ్యవృష్టి స్సస్యహానిః నృపాణాం సమరం మహత్, ఇదం ఫలం జ్యేష్ఠ శు ౩ పర్యంత మత ఊర్ధ్వం మిథునరాశిస్థిత గురుఫలం. శ్లో॥ సురేంద్రవంద్యే భువి యుగ్మరాశిం గతే క్షితీశాః కలహోత్సుకాః స్యుః. ఈతేర్భయం శస్త్రభయం ప్రజానాం క్వచిత్సువృష్టిర్వర్షంతి పయోధరాశ్చ. ఇదంఫల మబ్దాంతం. ఏతత్సంవత్సర జ్యేష్ఠ శు 3 భౌమవాసరే సరస్వతీ పుష్కర ప్రవేశః.

## శనిచారఫలం.

ఆర్ద్రాది కటకరాశిస్థిత శనిఫలం. శ్లో॥ కుళీరగే సూర్యసుతే ధరిత్రీ సువృష్టి సస్యార్ఘ ఫలాన్వితా స్యాత్, వైరోత్తమాః పందస దాంతికాశ్చ సర్వేశరోగా భువి వినాశ మాయాంతి. ఇదం ఫలం భాద్రపద శు ౧౦ పర్యంత మత ఊర్ధ్వం సింహరాశిస్థిత శనిఫలం. శ్లో॥ మృగేంద్రసంస్థే రవిజే తదానీం జనాః స్యు రన్యాయ పథానుగాశ్చ, బాహ్లీక గాంధారక చీనకోష్ఠ పరాన్తిక స్యాద్గతి కాశ్చ నష్టాః ఇదం ఫలం ఫాల్గున బ ౮ పర్యంత మత ఊర్ధ్వం వక్రగత్యా కర్కటకరాశిస్థితస్య శనేః ఫలం పూర్వమేవోక్తం. ఇదంఫల మబ్దాంతం. ఆర్ద్రాది పుష్యమీనక్షత్రస్థితస్య శనేః ఫలం. శ్లో॥ పుష్యే శనౌ వణిక్ప్రయుతవాశ్చ లభంతే యశః. ఇదంఫలం వైశాఖ శు ౧౧ పర్యంత మత ఊర్ధ్వ మాశ్లేషానక్షత్ర స్థితస్య శనేః ఫలం. శ్లో॥ శాంతి సార్వస్థిత మన్యార్ఘ్య మానమర్ఘ్య లరుహోరగాః. ఇదంఫలం భాద్రపద శు ౧౦ పర్యంత మత ఊర్ధ్వం మఘానక్షత్రస్థితస్య శనేః ఫలం. శ్లో॥ పిత్ర్యస్థితే రోగా బాహ్లీక చీన గాంధార వైశ్యపాల్. ఇదంఫలం ఫాల్గున బ ౮ పర్యంత మత ఊర్ధ్వం వక్రగత్యాశ్లేషానక్షత్రస్థితస్య శనేః ఫలం పూర్వమేవోక్త మిదంఫల మబ్దాంతం.

## జ్యేష్ఠశుక్ల ప్రతిపద్యుక్త వారఫలం.

శ్లో॥ దుర్భిక్షయుద్ధామయభీతయశ్చ నృపా నృపా క్రోధయుతాః ప్రమత్తాః। సస్యాని మధ్యాని భవంతి లోకే జ్యేష్ఠాదియుక్తే యది భానువాసరే.

## ఆషాఢశుక్లపంచమీ యుక్తవారఫలం.

అతితాపః.

## ఆషాఢశుక్లనవమీ యుక్తనక్షత్రఫలం.

శ్లో॥ ఆషాఢే శుక్లపక్షేతు నవమీ స్వాతిసంయుతా, వాయుస్సర్వత్ర సంవాతి భూమౌ బీజం న వాపయేత్.

## తత్కృష్ణపక్ష రోహిణీయుక్త తిథిఫలం.

శ్లో॥ ఆషాఢే కృష్ణపక్షేతు రోహిణ్యేకాదశీయుతా, సర్వ సస్యసమృద్ధిః స్యా ద్వృష్టిసంపూర్ణతా భవేత్.

## పౌషకృష్ణామాయుక్త వారఫలం.

సస్యవర్ధనం.

## అస్మిన్నబ్దే పశునాయకో గోపాలస్తస్యఫలం.

శ్లో॥ పశువృద్ధి స్సుభిక్షంచ బహుసస్యార్ఘ సంపదః, సంపూర్ణ క్షీరవృద్ధిశ్చ గోపాలే పశునాయకే సర్వమాలోక్య నిశ్చితః దశాంశాధిక గ్రాసః.

## గురుశుక్రమౌఢ్యనిర్ణయః.

వైశాఖ బ ౬ ప్రభృతి జ్యేష్ఠ బ ౬ పర్యంతం గురుమౌఢ్యం. ఆశ్వయుజ శు ౧౩ ప్రభృతి పౌష శు ౧ పర్యంతం శుక్రమౌఢ్యం.

## మకరసంక్రాంతిఫలం.

ఏతత్సంవత్సర పౌష శు ౧౨ సోమవాసరే ౫౮-౧౮ ఘటికా భోగసహయోరవేర్మకరరాశి ప్రవేశాత్ తత్ఫలం సంక్రాంతిపురుష లక్షణం చాభివర్ణ్యతే. శ్లో॥ త్రిశీర్షం ద్విముఖం నైరపంచనేత్రం త్రినేత్రకం, లంబకర్ణం రక్తదంతం లంబభ్రూ దీర్ఘ నాసికం. అష్టబాహుం ద్విపాదం చ వికృతం కృష్ణవర్ణకం, స్త్రీరూపంచ విశేషం సంక్రాంతి నర లక్షణం. అస్య పురుషస్య ధ్వాంక్షనామధేయ స్తస్యఫలం. వైశ్యనాశః. చందనోదక స్నానం తస్యఫలం



వర్షించును వని తోఁచుచున్నది గాని కుజరాహువులు వాయువాడియందును కేతువు దహనవాడియందును సంచరించుటచేతను స్వాతీ కుజయోగ ముండుటను శుక్రునికి ముందు శని నడచుటచేతను ఖండవృష్టి కలుగును. భాద్రపదమున రవి మేఘజలనీర వాడులయందు బుధశుక్రులు సుధామేఘ జలవాడులయందు గురువు నీరజలవాడులయందు శని సుధావాడియందు సంచరించుటచేతను శనికి నక్షత్ర చలనము కలుగుటను శుక్రుఁడు పూర్వ మఘాపంచకాంతర్గత నక్షత్రములయందు సంచరించుటచేతను విశాఖాకుజయోగ ముండుటను సకల దేశములయందుఁ జక్కఁగ వర్షించును. ఆశ్వయుజమున గురువు జలవాడియందు శని సుధావాడియందు సంచరించుటచేతను బుధశుక్రులకు ముందు రవి నడచుటచేతను హస్తాశుక్రయోగ ముండుటను వర్షించును. రవి కుజ బుధ శుక్ర కేతువులు దహన వాయు చండ వాయు వాడులయందు రాహువు వాయువాడియందు సంచరించుటచేతను జ్యేష్ఠాకుజయోగ ముండుటను కొన్ని స్థలముల నంతగా వర్షింపదు. బుధునికి ముందుఁ గుజుఁడు నడచుచున్నందున సస్యనాశము సంభవించును. శుక్రుఁడు హస్తానక్షత్రమం దుండి యస్తమించుటచే మర్త్య పశువ్యాధు లంకురించును. కార్తికమున గురుఁడు జలవాడియందు శని సుధావాడియందు సంచరించుటచేతను పూర్వాషాఢాకుజయోగ ముండుటను వర్షించును గాని రవి శుక్రులు చండ వాయువాడియందుఁ గుజుఁడు దహనవాడియందు బుధుఁడు చండ వాయుదహన వాడులయందు రాహుకేతువులు వాయువాడియందు సంచరించుటచేతను రవి శుక్రులకు ముందు గుజుఁడు నడచుటచేతను కొంత వర్ష ప్రతిబంధక మేర్పడును. గురుకుజులు సమసప్తకమం దున్నందున క్షుధాశస్త్రభయము కలుగును. మార్గశిరమునఁ గుజగురులు జలనీరవాడులయందును శని సుధావాడియందును సంచరించుట జ్యేష్ఠాశుక్రయోగ ముండుట వర్ష హేతువులే కాని రవి బుధ శుక్రులు దహనవాడియందు రాహుకేతువులు వాయువాడియందు సంచరించుటచేతను శుక్రునికి ముందు గుజుఁడు నడచుచున్నందునను గురుశుక్రులు రవి గురులు సమసప్తకమం దుండినందున ఉత్తరాషాఢా కుజయోగ ముండినందునను చిక్కఁగ వర్షింపదు. గురుశుక్రులు సమసప్తకమం దుండినందున శని సింహమున వక్రించి యుండుటచేతను లోకపీడ కలుగును. ఈ మాసము మొదలు వత్సరాంతముకు శని వక్రించియుండి కుజుఁడు బుధాగతి కలవాఁ డగుటచే వర్షాభావ మని తోఁచుచున్నది. పౌషమున రవి నీరజల మేఘవాడులయందుఁ గుజుఁడు సుధామేఘవాడులయందు గురువు నీరవాడియందు శుక్రుఁడు జలమేఘ సుధావాడులయందు శని సుధావాడియందు సంచరించుటచేతను శుక్రోదయ మగుటను ఉత్తరాషాఢా శుక్రయోగ ముండుటను నచ్చటచ్చట వర్షించును. ఈమాసమునను చైత్రమాసమునను గుజశుక్రులు కలిసి యున్నందున రాజకలహములు కలుగును. శుక్రుఁ డుత్తరాషాఢానక్షత్ర మందుండి యుదయించుటచేఁ బ్రజ లాహారధాన్యములకై తహతహ పడుదురు. మాఘమున రాహువు వాయుచండ వాయువాడులయందుఁ గేతువు వాయువాడియందు సంచరించుట వర్ష ప్రతిబంధక మయినను రవి సుధామేఘ వాడులయందుఁ గుజ బుధ శుక్రులు సుధామేఘ జలనీర వాడులయందు గురువు నీరవాడియందు శని సుధావాడియందు సంచరించుటచేతను పూర్వాభాద్రాకుజయోగ ముండుటను బట్టి కొన్ని హోటులఁ గొంచెముగ నయినను వర్షించును. ఫాల్గుణమున రవి నీరజలవాడులయందు గురువు నీరవాడియందు శని సుధావాడియందు సంచరించుట మాసాదియందుఁ గుజ బుధశుక్రులు కలిసియుండుట సుయోగములు. కుజబుధులు దహనవాడియందు శుక్రుఁడు దహనవాయుచండ వాయువాడులయందు రాహువు చండ వాయు వాడియందుఁ గేతువు వాయువాడియందు సంచరించుట రేవతీకుజయోగ ముండుట కుజుఁడు నడచుమార్గమున రవి నడచుట యుత్తరాభాద్రాకుజయోగ ముండుట యవయోగములు. అవయోగ బలమే మెండు. బుధశుక్రులకు మధ్యఁ గుజుఁ డున్నందున గాలి వీచును. బుధుఁడు గుజునితోఁ గలిసి యున్నందున మెలకుండును.

### శుభముహూర్తనిర్ణయః.

చైత్ర బ ౨ ఆ, అను, రాత్రౌ వివాహాదీనాం మీనో రహితః

,, బ ౩ సో, జ్యే, దివా, దోలారోహణస్య వృషభః పక్షక రహితః

,, బ ౬ గు, ఉషా, రాత్రౌ వివాహాదీనాం మీనః పక్షకరహితః

,, బ ౧౧ సో, ఉభా, రాత్రౌ వ్యాపార ప్రారంభస్య మీనోరహితః

వైశా, శు ౨ ఆ. రో, దివా, వివాహాదీనాం వృషభోరహితః

,, ,, ,, ,, రాత్రౌ వివాహాదీనాం మీనోరహితః

,, శు ౩ సో, మృ, దివా, వివాహాదీనాం వృషభోరహితః

,, శు ౭ శు, మ, రాత్రౌ వివాహాదీనాం మీనో రహితః

,, శు ౧౦ సో, హ, రాత్రౌ వివాహాదీనాం మేషో రహితః

శ్రావ, శు ౮ శ, హ, రాత్రౌ వివాహగృహప్రవేశాదీనాం మిథునం రహితః

,, శు ౧౫ సో, చి, రాత్రౌ వివాహాదీనాం మిథునం రహితం

,, బ ౨ శ, ఉభా, రాత్రౌ వివాహాదీనాం మిథునం రహితం

,, బ ౪ గు, రో దివా, వివాహాదీనాం కన్యా రహితా

మాఘ శు ౩ సో, శత, దివా, అన్నప్రాశనాదీనాం మీనోరహితః

,, శు ౬ గు, అశ్వి, దివా, ఉపనయనాదీనాం మీనోవృషభరహితః

,, శు ౧౩ బు, పున, దివా, ఉపనయనాదీనాం మీనోరహితః

,, బ ౧ శ, మ, దివా వివాహాదీనాం మీనోరహితః

ఫాల్గున బ ౧ సో, ఉఫ, దివా వివాహాదీనాం మేషోరహితః

వాస్తువిషయము:—భాద్రపద దాశ్వయుజ కార్తికమాసములఁ బూర్వశిరస్సుగా, మార్గశిర పౌష మాఘమాసముల దక్షిణ శిరస్సుగా, ఫాల్గున చైత్ర వైశాఖమాసములఁ బశ్చిమశిరస్సుగా, జ్యేష్ఠాషాఢ శ్రావణమాసముల నుత్తరశిరస్సుగా, వాస్తుపురుషుఁడు వామహస్తమును దలక్రింద నిడికొని శయనించును. అతనిదృష్టియుఁ బాదములుఁ గలదిక్కున వాయామాసముల నిండ్లు కట్టఁగూడదు.

గౌళిపతనఫలం:—శిరసి కలహః. లలాటే బంధుదర్శనం. భ్రూయుగ్మే రాజానుగ్రహః. భ్రూమధ్యే నిర్ధనః. ఉత్తరోష్ఠే ధనవ్యయః. అధరోష్ఠే ధనలాభః. నాసికాగ్రే వ్యాధిసంభవః. దక్షిణ కర్ణే దీర్ఘాయుః. వామకర్ణే వాణిజ్యలాభః. నేత్రయుగ్మే కారాగృహ ప్రాప్తిః. ముఖే రాజదండః. వక్త్రే భయం. కంఠే శత్రునాశనం. దక్షిణభుజే పరారోగ్యం. వామభుజే స్త్రీసంభోగః. వామమణిబంధే యశః. దక్షిణమణిబంధే పీడా. స్తనయుగ్మే దోషః. ఉదరే ధాన్యలాభః. వక్షసి నాభౌ చ ధనలాభః. పార్శ్వయో స్స్వజనలాభః. ఊరుజఘే పిత్రరిష్టం. జానుజంఘయోస్సుఖం. పాదయోః ప్రయాణం పృష్ఠభాగే శుభం. నఖేషు ధనవ్యయః. కేశాంతే మృత్యుభయం. గౌళిపతనఫల మేవం ద్రష్టవ్యం. కృకలాసస్యాపి తదేవఫలం.

యోనిపొంతనము:— అశ్వినీ శత తారలు గుఱ్ఱములు. భరణీరేవతు లేనుఁగులు. కృత్తికాపుష్యము లజములు. రోహిణీమృగశీర్షలు పాములు. ఆర్ద్రామూలలు శునకములు. ఆశ్లేషాపునర్వసులు పిల్లులు, మఘాపూర్వాఫల్గునులు ఎలుకలు. ఉత్తరాఫల్గున్యుత్తరాభాద్రలు గోవులు. హస్తాస్వాతులు దున్నపోతులు. చిత్రావిశాఖలు పెద్దపులులు. అనూరాధాజ్యేష్ఠలు లేళ్లు. పూర్వాషాఢా శ్రవణములు కోఁతులు. ధనిష్ఠాపూర్వాభాద్రలు సింహములు. ఉత్తరాషాఢాభిజిత్తులు ముంగిసలు. వీనిని విచారించి విరోధజంతునక్షత్రములు గల స్త్రీపురుషులకు వివాహముఁ జేయఁగూడదు.

### అబ్దాదికృత్యము.

సంవత్సరాది దినమున సుదయమున లేచి శాస్త్రాచారక్రమమున స్నానసంధ్యాద్యనుష్ఠానములఁ దీర్చుకొని మిత్రబంధువర్గముతోఁ గూడి వస్త్రభూషణాదుల నలంకరించుకొని యుదఙ్ముఖుఁడై కాని ప్రాఙ్ముఖుఁడై కాని దైవజ్ఞసమ్ముఖమునఁ గూర్చుండి విఘ్నేశ్వరుని సరస్వతిని నవగ్రహములను దైవజ్ఞుని బ్రాహ్మణులను గురువును బూజించి సాంగోపాంగముగ సంవత్సర ఫలమును వినవలయును. ప్రథమయామమున శర్కరాజ్యమృతసమ్మిశ్ర మగు నింబకుసుమమును భక్షింపవలయును. ఇట్లాచరించెనేని సంవత్సరమంతయు సౌఖ్యదాయ[illegible]మయి యుండునని శాస్త్రము.

దైవజ్ఞ లక్షణము:— శ్లో. అక్లేశీ నిత్యసంతోషీ గణితాగమపారగః, ముహూర్తగుణదోషజ్ఞో వాగ్మీ కుశలబుద్ధిమాన్, శాంతశ్చాప్యుత వాక్పాదుః శ్రీకాలజ్ఞో జితేంద్రియః, నిత్యకర్మరతో యోగీ స దైవజ్ఞః ప్రకీర్తితః. దశదినకృతదోషం హంతిసిద్ధాంతవేత్తా త్రిదినజనితమంహః స్తంత్రవేత్తా నరాణాం, కరణభగణవేత్తా చైకరాత్రోత్థపాపం జనయతి బహుపాపం కేవలనక్షత్రసూచీ. అవిదిత్వైవ యచ్ఛాస్త్రం దైవజ్ఞత్వం ప్రపద్యతే, నక్షత్రసూచీ స భవే త్సర్వకర్మబహిష్కృతః.

### పంచాంగశ్రవణఫలం

శ్లో. యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షనాథ సచివాదికం ఫలం, ప్రాప్నుయా ద్దురితముక్తవిగ్రహ శ్చాయు రర్థబహులం యశస్సుఖం, కపాలశవిశాంచన దిగ్గజానాం గవాం సహస్రం సతతం ద్విజేభ్యః, దత్వా ఫలం యల్లభతే మనుష్య స్తత్తిథ్యలా నక్షత్రఫలం చ శృణ్వన్. ఆయుర్వృద్ధిం పుత్రపౌత్రాభివృద్ధిం విత్తారోగ్యం సంపదం నిర్విపాయాం, అబ్దస్నానా మూర్త్వా వామవాప్తిం యశస్యం శ్రుత్వే తే వత్సరాధీశముఖ్యాః. రాజామంత్రీ సస్యనాథో రసేశ స్సేనాధీశః ధాన్యపో నీరసేశః, అర్ఘాధీశః కించ మేఘాధినాథో దద్యుః శ్రేయః శృణ్వతాం తత్ఫలాని. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

కుజచారః.

చైత్ర, శు౭గు,క్రీపూష ౩ వక్రీ కుజః
" శు ౧౨ సో, కుజవక్రత్యాగః
వైశా, శు ౧౧ మం, ఉష ౧ కుజః
" బ ౮ శ, ఉష ౨ శ్రవ్యాయాం [ఋజ్వీకుజః
జ్యేష్ఠ, బ ౧ మం, శ్ర ౧ కుజః
ఆషా, శు ౧౨ శ, చి ౧ కుజః
" బ ౯ గు, చి ౩ తులాయాం కుజః
శ్రా" శు ౫ సో, స్వా ౧ కుజః
" బ ౧౨ సో, వి ౧ కుజః
భాద్ర, శు ౧౨ మం, వి ౪ వృశ్చికే కుజః
" బ ౨ ఆ, అనూ ౧ కుజః
ఆశ్వ, శు ౬ శు, జ్యే ౧ కుజః
" బ ౧౧ బు, మూ ౧ ధనుషి కుజః
కార్తి, శు ౧౪ ఆ, పూషా ౧ కుజః
మార్గ, శు ౨ గు, ఉషా ౧ కుజః
" శు ౬ సో, ఉషా ౨ మకరే కుజః
" బ ౫ ఆ, శ్ర ౧ కుజః
పౌష, శు ౬ బు, ధ ౧ కుజః
" బ ౧ శు, ధ ౩ కుంభే కుజః
" బ ౯ శ, శ ౧ కుజః
మాఘ, శు ౧౧ మం, పూభా ౧ కుజః
" బ ౯ సో, పూభా ౪ మీనే కుజః
" బ ౧౩ శు, ఉభా ౧ కుజః
ఫాల్గు, శు ౮ శ, పశ్చాదస్తమితః కుజః
" బ ౧ సో, రే ౧ కుజః

బుధచారః

చైత్ర, శు ౮ బు, బుధవక్రారంభః
" శు ౧౧ ఆ, పశ్చాదస్తమితో బుధః
" బ ౧౨ మం, ప్రాగుదితో బుధః
" బ ౩౦ శు, బుధవక్రత్యాగః
వైశా, బ ౭ ఆ, కృ ౨ వృషభే బుధః
జ్యేష్ఠ శు ౨ సో, ప్రాగస్తమితో బుధః
" శు ౧౧ గు, మృ ౩ మిథునే బుధః
" బ ౧౨ శు, పున ౪ కర్కాటకేబుధః
ఆషా, శు ౬ ఆ, పశ్చాదుదితో బుధః
" శు ౧౫ మం, మ ౧ సింహే బుధః
శ్రావ, శు ౬ మం, బుధవక్రారంభః
" శు ౧౦ శ, పశ్చాదస్తమితో బుధః
శ్రావ, బ ౧౨ సో, ప్రాగుదితో బుధః
" బ ౩౦ గు, బుధవక్రత్యాగః
భాద్ర, బ ౯ శ, ఉఫ ౨ కన్యాయాం బుధః
" బ ౩౦ శ, ప్రాగస్తమితో బుధః
ఆశ్వ, శు ౧౧ బు, చి ౩ తులాయాం బుధః
" బ ౧౪ శ, వి ౪ వృశ్చికే బుధః
కార్తి, శు ౩ బు, పశ్చాదుదితో బుధః
" బ ౬ శ, మూ ౧ ధనుషి బుధః
మార్గ, శు ౨ గు, బుధవక్రారంభః
" శు ౫ ఆ, పశ్చాదస్తమితో బుధః
" శు ౧౫ మం, జ్యే ౪ వృశ్చికేవక్రీబుధః
" బ ౭ బు, ప్రాగుదితో బుధః
" బ ౧౧ శ, బుధవక్రత్యాగః
పౌష, శు ౬ బు, మూ ౧ ధనుషిఋజ్వీబుధః
" బ ౧౦ ఆ, ప్రాగస్తమితో బుధః
" బ ౧౩ బు, ఉషా ౨ మకరే బుధః
మాఘ, బ ౧ శ, ధ ౩ కుంభే బుధః
" బ ౧౩ శు, పశ్చాదుదితో బుధః
ఫాల్గు, శు ౨ మం, పూభా ౪ మీనే బుధః
" బ ౩౦ సో, బుధవక్రారంభః

గురుచారః

చైత్ర, శు ౧౫ శు, రో ౪ గురుః
వైశా, శు ౨ ఆ, మృ ౧ గురుః
" బ ౨ సో, మృ ౨ గురుః
" బ ౬ శు, పశ్చాదస్తమితో గురుః
జ్యేష్ఠ, శు ౨ సో, మృ ౩ మిథునే గురుః
" బ ౧ మం, మృ ౪ గురుః
" బ ౬ ఆ, ప్రాగుదితో గురుః
ఆషా, శు ౧ మం, ఆర్ద్రా ౧ గురుః
" బ ౨ గు, ఆర్ద్రా ౨ గురుః
శ్రావ, శు ౪ శ, ఆర్ద్రా ౩ గురుః
" బ ౮ బు, ఆర్ద్రా ౪ గురుః
భాద్ర, శు ౧౩ బు, పున ౧ గురుః
ఆశ్వ, బ ౩౦ ఆ, గురువక్రారంభః
మార్గ, బ ౨ గు, ఆర్ద్రా ౪ వక్రీ గురుః
పౌష, శు ౧౨ సో, ఆర్ద్రా ౩ వక్రీగురుః
మాఘ, బ ౪ బు, ఆర్ద్రా ౨ వక్రీగురుః
" బ ౩౦ ఆ. గురువక్రత్యాగః
ఫాల్గు, శు ౧౨ గు, ఆర్ద్రా ౩ ఋజ్వీగురుః

శుక్రచారః

చైత్ర, శు ౨ శ, శ ౩ శుక్రః
" బ ౪ మం, పూభా ౪ మీనే శుక్రః
వైశా, బ ౨ సో, అశ్వి ౧ మేషే శుక్రః
జ్యేష్ఠ, శు ౧౩ శ, కృ ౨ వృషభే శుక్రః
ఆషా, శు ౧౦ గు, మృ ౩ మిథునే శుక్రః
శ్రావ, శు ౫ సో, పున ౪ కర్కాటకే శుక్రః
భాద్ర, శు ౧ శు, మ ౧ సింహే శుక్రః
" బ ౧౧ సో, ఉఫ ౨ కన్యాయాంశుక్రః
ఆశ్వ, శు ౧౩ శు, ప్రాగస్తమిత శ్శుక్రః
" బ ౫ గు, చి ౩ తులాయాం శుక్రః
కార్తి, శు ౧౪ ఆ, వి ౪ వృశ్చికే శుక్రః
మార్గ, శు ౭ బు, మూ ౧ ధనుషి శుక్రః
పౌష, శు ౧ శు, పశ్చాదుదిత శ్శుక్రః
" శు ౨ శ, ఉషా ౨ మకరే శుక్రః
" బ ౧౨ మం, ధ ౩ కుంభే శుక్రః
మాఘ, బ ౬ శు, పూభా ౪ మీనే శుక్రః
ఫాల్గు, బ ౧ సో, అశ్వి ౧ మేషే శుక్రః

శనిచారః

వైశా, శు ౧౧ మం, ఆశ్లే ౧ ఋజ్వీ శనిః
జ్యేష్ఠ, బ ౨ బు, ఆశ్లే ౨ శనిః
ఆషా, బ ౧ బు, ఆశ్లే ౩ శనిః
" " " పశ్చాదస్తమిత శ్శనిః
శ్రావ, శు ౧౨ సో, ఆశ్లే ౪ శనిః
" బ ౭ గు, ప్రాగుదిత శ్శనిః
భాద్ర, శు ౧౦ ఆ, మ ౧ సింహే శనిః
ఆశ్వ, శు ౧౨ గు, మ ౨ శనిః
మార్గ, శు ౮ మం, శనివక్రారంభః
మాఘ, శు ౨ ఆ, మ ౧ వక్రీశనిః
ఫాల్గు, బ ౪ గు, ఆశ్లే ౪ కర్కాటకే వక్రీశనిః

రాహుకేతుచారః

జ్యేష్ఠ, శు ౧ ఆ, జ్యే ౪ వృశ్చికే రాహుః
[మృ ౨ వృషభే కేతుః
శ్రావ, శు౪ఆ, జ్యే౩రాహుః మృ౧కేతుః
ఆశ్వ, శు౭ ఆ, జ్యే ౨ రాహుః రో౪కేతుః
మార్గ, శు ౧౧ శ, జ్యే౧రాహుః రో౩కేతుః
మాఘ, బ౧ శ, అనూ ౪ రాహుః రో౨కేతుః

గౌరీపంచాఙ్గము. దినప్రమాణమునుగాని, రాత్రిప్రమాణమునుగాని, ౮-చే భాగింపఁగా వచ్చినలబ్ధము ముహూర్త

పగటి ముహూర్తములు.

| | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ఉద్వే | అమృ | రోగ: | విష: | ఉద్వే | రోగ: | విష: |
| ౨ | లాభ: | విష: | ఉద్వే | అమృ | విష: | జ్వర: | అమృ |
| 3 | విష: | ఉద్వే | జ్వర: | శుభం | జ్వర: | అమృ | జ్వర: |
| ౪ | అమృ | లాభ: | లాభ: | ఉద్వే | లాభ: | కలహ: | ఉద్వే |
| ౫ | శుభం | జ్వర: | అమృ | రోగ: | అమృ | లాభ: | శుభం |
| ౬ | ధనం | అమృ | ఉద్వే | శుభ: | విష: | సుఖం | లాభ: |
| ౭ | అమృ | లాభ: | విష: | ధనం | కలహ: | ధనం | ధనం |
| ౮ | విష: | ధనం | లాభ: | అమృ | జ్వర: | లాభ: | లాభ: |

రాత్రి ముహూర్తములు.

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| శుభం | రోగ: | జ్వర: | లాభ: | సుఖం | అమృ | విష: |
| అమృ | లాభ: | ఉద్వే | రోగ: | రోగ: | జ్వర: | ఉద్వే |
| జ్వర: | ఉద్వే | కలహ: | విష: | కలహ: | కలహ: | శుభం |
| రోగ: | ధనం | లాభ: | ఉద్వే | లాభ: | లాభ: | అమృ |
| కలహ: | రోగ: | రోగ: | శుభం | ఉద్వే | శుభం | కలహ: |
| లాభ: | అమృ | లాభ: | లాభ: | జ్వర: | ధనం | రోగ: |
| ఉద్వే | విష: | ఉద్వే | ధనం | లాభ: | అమృ | లాభ: |
| రోగ: | జ్వర: | ధనం | లాభ: | ఉద్వే | విష: | లాభ: |

నవగ్రహము లాయాస్థానముల నుండునపు డిచ్చెడి ఫలములను దెలియఁజేయు చక్రము.

| | ౧ | ౨ | 3 | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రవి: | చలనం | భయం | సంపత్ | మానహాని: | చాంచల్యం | శత్రునాశ: | దేహపీడా | రోగ: | భయం | లాభ: | ఆరోగ్యం | వ్యయ: |
| చంద్ర: | సౌజన్యం | వ్యయ: | లాభ: | హాని: | పీడా | శుభం | లాభ: | వ్యయ: | వ్యాకులం | లాభ: | సుఖం | దుఃఖం |
| కుజ: | ఖేద: | హాని: | లాభ: | భయం | వైకల్యం | ధనలాభ: | కలహ: | భయం | వ్యయ: | చలనం | లా: | రోగ: |
| బుధ: | బంధనం | లాభ: | వ్యయ: | శుభం | దారిద్ర్యం | ఆరోగ్యం | వ్యసనం | సంతోష: | దుఃఖం | శుభం | సుఖం | వ్యయ: |
| గురు: | గమనం | ధనలాభ: | ఆపత్ | వ్యయ: | సంపత్ | దుఃఖం | ఆరోగ్యం | హాని: | ధనలాభ: | హాని: | సంతోష: | పీడా |
| శుక్ర: | ఆరోగ్యం | భాగ్యం | సౌఖ్యం | సుఖం | పుత్రలాభ: | వ్యయ: | క్లేశ: | భయం | ధనలాభ: | సౌఖ్యం | లాభ: | [illegible] |
| శని: | ఆపత్ | హాని: | సంపత్ | రోగ: | పీడా | శుభం | దండనం | దుఃఖం | రోగ: | జాడ్యం | లాభ: | క్లేశ: |
| రాహు: | భయం | కలహ: | సౌఖ్యం | మృత్యు: | ధనవ్యయ: | సుఖం | భయం | మృత్యు: | సంతాప: | కలహ: | లాభ: | హా[illegible] |
| కేతు: | భయం | నిరోధ: | సౌఖ్యం | హాని: | క్లేశ: | రోష: | భీతి: | హాని: | కలహ: | కలహ: | లాభ: | [illegible] |

# ఆనందామృత సిద్ధాది యోగములు.

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | మృగ | ఆశ్లే | హస్తా | అనూ | ఉషా | శత | ఆనందయోగము |
| ౫ హస్తా | ౬ శ్ర | ౭ అశ్వి | ౮ అనూ | ౯ పుష్య | ౧౦ రే | ౧౧ రో | అమృతసిద్ధయోగము |
| మూలా | శ్రవ | ఉభా | కృత్తి | పున | పూఫ | స్వాతీ | అమృతాదియోగము |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉఫ | ఉత్పాతయోగము ౯ గడియలవఱకు |
| అనూ | ఉషా | శత | అశ్వి | మృగ | ఆశ్లే | హస్తా | మృత్యుయోగము ౫ గడియలవఱకు |
| జ్యే | అభి | పూభా | భర | ఆర్ద్రా | మఘా | చిత్రా | రంధ్రయోగము ౪ గడియల వఱకు |
| భర | చిత్రా | ఉషా | ధని | ఉఫ | జ్యేష్ఠా | రేవ | గ్రహజన్మయోగము౯గడియలవఱకు |

౩-౮-౧౧ ౨-౭-౧౨ ౫-౧౦-౧౫ ౧-౬-౧౧ ౪-౯-౧౪ సిద్ధతిథి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ౧౨ మ | ౧౦ విశా | ౯ ఆర్ద్రా | ౩ మూ | ౨ రో | ౬ శత | ౭ ఆశ్లే | త్రిపుష్కరయోగము |
| ౧౨ | ౧౧ | ౫ | ౩ | ౬ | ౮ | ౯ | దగ్ధయోగము ౬ గడియల వఱకు |
| మఘా | పుష్య | కృత్తి | మృగ | మూ | రోహి | శ్రవ | యమకంటక యోగము ౭ గడియల వఱకు |
| పూఫ | ఆశ్లే | అనూ | ఉఫ | లా | స్వాతీ | ధని | |

# కాళయుక్తినామ సంవత్సర పంచాఙ్గ పీఠికా

## శుభాశుభ తిథివారనక్షత్ర లగ్ననిర్ణయః

| నెం | శుభములు | తిథులు | వారములు | నక్షత్రములు | మాసములు | లగ్నములు | శుద్ధులు | యోగ్యకాలము |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | గర్భాధానము | ౨, ౩, ౫, ౭<br>ద్వి, తృ, పం, స<br>౧౦, ౧౩<br>ద, త్ర | ౨, ౪, ౫<br>సో, బు, గు<br>౬<br>శు | ౪, ౫, ౬, ౭, ౮, ౧౨, ౧౩, ౨౪,<br>రో, మృ, ఆ, పు, పుష్య, ఉఫ, హ, చి,<br>౧౪, ౧౬, ౧౭, ౨౧, ౨౨, ౨౩, ౨౪,<br>స్వా, వి, అనూ, ఉషా, శ్ర, ధ, శ,<br>౨౬, ౨౭<br>ఉభా, రే | ౧, ౨, ౩, ౫<br>చై, వై, జ్యే,<br>శ్రా, ౮, ౯, ౧౧<br>కా, మార్గ, మా<br>౧౨<br>ఫాల్గు | ౨, ౩, ౪, ౫,<br>వృ, మి, క, సిం<br>౬, ౭, ౯, ౧౧<br>క, తు, ధ, కు<br>౧౨<br>మీ | ౮ | పూర్వరాత్రి |
| 2 | సీమంతము | ౨, ౩, ౫, ౭<br>ద్వి, తృ, పం, స<br>౧౦, ౧౧<br>ద, ఏ<br>౧౩, ౧౫<br>త్ర, పూ | ౧, ౩, ౫<br>ఆ, మం, గు | ౧, ౪, ౫, ౭, ౮, ౧౪, ౧౫, ౧౨, ౧౩,<br>అ, రో, మృ, పు, పు, ఉఫ, హ, చి, స్వా<br>౧౭, ౧౯, ౨౧, ౨౨, ౨౩, ౨౪,<br>అ, మూ, ఉషా, శ్ర, ధ, శ,<br>౨౬, ౨౭<br>ఉభా, రే | ౧, ౨, ౩, ౫,<br>చై, వై, జ్యే,<br>శ్రా, ౮, ౯, ౧౧<br>కా, మార్గ, మా<br>౧౨<br>ఫాల్గు | ౧, ౯, ౧౨<br>మే, ధ, మీ | ౯ | పూర్వాహ్ణము |
| 3 | చూడకరణము | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩, ౧౫ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౭, ౮, ౧౨, ౧౩, ౧౫, ౧౭, ౨౧,<br>౨౨, ౨౩, ౨౪, ౨౬ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౪, ౬, ౭, ౯,<br>౧౨ | ౮ | పూర్వాహ్ణము |
| 4 | డోలా రోహణము | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౨, ౧౩,<br>౧౫ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౫, ౭, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭,<br>౧౮, ౧౯, ౨౧, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౨, ౩, ౪, ౭, ౯,<br>౧౨ | ౮ | దినమందు |
| 5 | అన్నప్రాశనము | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౩, ౧౫ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౫, ౭, ౮, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭,<br>౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౨, ౩, ౪, ౬, ౯,<br>౧౨ | ౧౦ | పూర్వాహ్ణము |
| 6 | కేశఖండనము | ౨, ౩, ౫, ౭, ౧౦ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౫, ౭, ౮, ౧౩, ౧౪, ౧౫, ౨౨, ౨౩<br>౨౪, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౩, ౪, ౬, ౯,<br>౧౨ | ౧౦ | పూర్వాహ్ణము |
| 7 | కర్ణవేధ | ౨, ౩, ౫, ౬, ౭,<br>౧౦, ౧౧, ౧౨<br>౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౫, ౬, ౭, ౮, ౧౨, ౧౩, ౧౪, ౨౦,<br>౨౨, ౨౩, ౨౬, ౨౭ | ౧, ౨, ౮, ౯,<br>౧౧, ౨౨ | ౨, ౩, ౪, ౯, ౯,<br>౧౨ | ౮ | దినమందు |
| 8 | అక్షరా భ్యాసం | ౨, ౩, ౫, ౬, ౭,<br>౧౦, ౧౧, ౧౨ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౭, ౮, ౧౩, ౧౪, ౧౫, ౧౭, ౨౨, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౧, ౪, ౧౦, ౭ | ౮ | పూర్వాహ్ణము |
| 9 | ఉపనయనం | ౨, ౩, ౫, ౧౦ | ౧, ౨, ౪<br>౫, ౬ | ౧, ౩, ౫, ౭, ౮, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭<br>౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౩, ౪, ౧౨ | ౮ | పూర్వాహ్ణము |
| 10 | వివాహం | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩ | ౪, ౫, ౬ | ౪, ౫, ౧౦, ౧౨, ౧౩, ౧౫, ౧౭, ౧౯,<br>౨౧, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౧౧,<br>౧౨ | ౧, ౨, ౩, ౪, ౫,<br>౬, ౭, ౮, ౯,<br>౧౦, ౧౧ | ౭ | పూర్వాహ్ణము రాత్రి |
| 11 | యాత్ర | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౫, ౭, ౮, ౧౩, ౧౭, ౨౨, ౨౩, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౧, ౨, ౪, ౭, ౯,<br>౧౦, ౧౨ | ౦ | దివారాత్రము లు |
| 12 | నూతన వస్త్ర ధారణం | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౨, ౧౩, ౧౫ | ౪, ౫, ౮ | ౧, ౪, ౫, ౭, ౧౨, ౧౩, ౧౪, ౧౫, ౧౭,<br>౧౯, ౨౧, ౨౨, ౨౩, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౧, ౨, ౩, ౪, ౫,<br>౬, ౭, ౮, ౯,<br>౧౦, ౧౧, ౧౨ | ౦ | దివారాత్రము లు |
| 13 | వ్యాపార ప్రారంభం | ౨, ౩, ౫, ౭, ౧౦<br>౧౧, ౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౫, ౮, ౧౦, ౧౨, ౧౩, ౧౭, ౨౧,<br>౨౨, ౨౪, ౨౬, ౨౭ | ౧, ౨, ౩, ౫, ౮,<br>౯, ౧౧, ౧౨ | ౨, ౪, ౮, ౧౦,<br>౧౧, ౧౨ | ౮ | పూర్వాహ్ణము రాత్రి |
| 14 | గృహప్రవేశం | ౨, ౩, ౫, ౯,<br>౧౦, ౧౧, ౧౫ | ౪, ౫, ౬ | ౪, ౫, ౧౨, ౧౪, ౧౭, ౨౧, ౨౩, ౨౪,<br>౨౬ | ౨, ౩, ౧౧,<br>౧౨ | ౨, ౩, ౬, ౯,<br>౧౧, ౧౨ | ౧౨ | పూర్వాహ్ణము రాత్రి |
| 15 | నిషేకము | ౨, ౩, ౫, ౭,<br>౧౦, ౧౩ | ౨, ౪, ౫<br>౬ | ౧, ౪, ౧౨, ౧౩, ౧౫, ౧౭, ౧౯,<br>౨౧, ౨౨, ౨౪, ౨౬, ౨౭ | ౨, ౩, ౪, ౮, ౯,<br>౧౧, ౧౨ | ౨, ౩, ౫, ౬, ౭,<br>౯, ౧౧, ౧౨ | ౮ | పూర్వరాత్రి |

THE PRINCE OF WALES

వేల్సు యువరాజుగారు

GENERAL SIR ARCHEBOLD MURRAY



జనరలు సర్ ఆర్చిబాల్డు ముర్రే

THE AMBULANCE CAR. M. A. C.




అంబ్యులెన్సుకారు. ఎమ్. ఎ. సి.

THE VICEROY & THE SECRETARY OF STATE

ఇండియామంత్రి గవర్నరుజనరలు మున్నగువారు

Mr. LLOYD GEORGE



లాయడు జార్జి గారు

SIR ROBERT BORDEN



సర్ రాబర్టు బోర్డన్

Mr. W. H. HUGHES



డబ్ల్యు. హెచ్. హ్యూగ్సు

M. J. D. HAZEN



ఎం. జె. డి. హాజెన్

MAHARAJA OF BIKANIR



బికనీరు మహారాజా గారు



# ప్రస్తావన

ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే - నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః.

ప్రపంచమహోపద్రవమునం దొక వత్సర మస్తంగత మైనది, సృష్ట్యాదినుండియు ౧౯,౫౫,౮౮,౫౦౧౯ అబ్దములు ముగిసినవి. పింగళసంవత్సరము గతించినది. కాళయుక్తిసంవత్సర మారంభ మైనది. ఆనంద సంవత్సరమునం దారంభ మైన మహాసంగ్రామయుగము భీకరాకృతి దాల్చి లోకక్షయము చేయుచున్నది. భీకర సంగ్రామము మహాసంక్షోభమునకు కారణంబుగ నున్నది. యూరపుఖండమును భస్మీపటలము చేయుచున్న సంగ్రామదావానలము అమెరికా ఆసియా ఖండములకు వ్యాపించుచున్నది. మాతృదేశసీమాంతములందు సంగ్రామానలాంకురములు రగులుట కవకాశము లేర్పడు నను సూచనలు గోచరం బగుచున్నవి. మాతృదేశ సంరక్షణమునకు ప్రబలప్రయత్నములు చేయఁబడుచున్నవి. భారతపుత్రు లాయుధపాణులై కృతనిశ్చయులై మాతృదేశసంరక్షణపరాయణు లగుటకు సమయ మాసన్న మైనది. సకల దేశములందును జీవయాత్ర దుర్భరం బగుచున్నది. ఆహారపదార్థములు వస్త్రములు పరికరములు దుర్లభము లగుచున్నవి. అపార మైన సంపదలు యుద్ధనిర్వహణమునకు వినియోగపడుచున్నవి. సంసార వ్యయభారము దుర్భర మగుచున్నది. ద్రవ్య మదృశ్యముగ నున్నది. కష్టములు ప్రబలుచున్నవి. అశాంతి పర్యాప్తం బగుచున్నది. భావికాలపరిణామ మగమ్య గోచరంబుగ నున్నది. కాళయుక్తిసంవత్సరమునందు నిగ్రహానుగ్రహసమర్థుఁ డైన సర్వేశ్వరుఁడు రౌద్రరూపమును శమింపఁజేసి సౌమ్యాకృతిని దాల్చి లోకమునకు శాంతిని ప్రసాదించుఁగాత!

కాళయుక్తిసంవత్సరమునకు శుక్రుఁడు రాజు, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి; ఫలము సస్య సమృద్ధి, సుభిక్షము, క్షామము, అతివృష్టి. శని మంత్రి; ఫలము ప్రజాపీడ. కుజుఁడు సస్యాధిపతి; ఫలము ఎఱ్ఱ నేల పంటలు. సూర్యుఁడు సస్యాధిపతి; ఫలము భయము, రక్తసస్యములు. గురువు రసాధిపతి; ఫలము మధురాన్నములు. చంద్రుఁడు నీరసాధిపతి; ఫలము శుభము, వృద్ధి. సామాన్యఫలము అతివృష్టి, సస్యసమృద్ధి, సుభిక్షము, శాంతి, ఆనందము.

శ్లో. అతివృష్టిః కాళయుక్తివత్సరే సుఖినో జనాః,
సర్వత్ర వృద్ధిశ్చ సస్యానాం సంపూర్ణానందతా భువి.

లోకమునకు దైవజ్ఞనిర్ణీతఫలము సంప్రాప్త మగుఁగాత!

మహాసంగ్రామమువలన పత్రికానిర్వహణము దుర్భర మగుచున్నది. యుద్ధారంభానంతరము కాగితముల ధర నైదు రెట్లు పెరిగినది. ఇతరనిర్మితపదార్థములవలె కాగితములు నయితము విదేశనిర్మితములు. విపరీత మైన క్రయము నిచ్చినను విదేశములనుండి కాగితములను పడయుట దుర్లభముగ నున్నది. ముద్రణమున కవశ్య మైన యితరపరికరముల ధరయు విపరీతముగ పెరిగినది.

దైవానుగ్రహమువలన తొమ్మిదవ సంవత్సరాది సంచికను ప్రచురించి ఆంధ్ర ప్రపంచమునకు సమర్పింపఁ జాలినందులకు పత్రికానిర్వాహకులు కృతజ్ఞులు.

కాళయుక్తి సంవత్సరాది సంచిక

గతసంవత్సరమున దేశమునందు స్వరాజ్యాందోళనము ప్రబలినది. హిందూదేశమంత్రి మాంటేగు గారు రాజ్యాంగసంస్కరణముల విషయమై ప్రజాభిప్రాయము నన్వేషించుటకై కార్తికమాసమున భరతఖండమునకు విచ్చేసిరి. వారు రాజప్రతినిధిసమేతులై దేశమునందు సంచారము చేసి విన్నపములను గైకొనిరి. రాయబారములను వినిరి. నాయకులతో సంప్రతించిరి. భరతవర్ష గతసంవత్సరవృత్తాంతమునందు మాంటేగు గారి సమాగమము ప్రముఖత గాంచినది. హిందూదేశమంత్రికి రాజ్యాంగసంస్కరణముల విషయమై అధికారులు జాతీయనాయకులు శాఖానాయకులు సంస్థానాధీశులు తమతమ యభిప్రాయములను విశదము చేసిరి. మాంటేగు గారు భిన్నాభిప్రాయములను సావధానముగ పరిశీలించి చెమ్సుఫర్డు ప్రభువుతో సంప్రతించి సంస్కరణ విధానమును సిద్ధము చేసినట్లు వదంతి గలదు. సంస్కరణముల రూపమును నిర్ణయించుట వర్తమానకాలమునం దసాధ్యము. కర్టిసు గారి సంస్కరణవిధానము ప్రసా

సుఖముగ స్వస్థలమును చేరిరి. అచిరకాలమున వారు ప్రచురింపఁదలఁచిన రాజ్యాంగవిధానము స్వరాజ్య స్థాపనమునకు మూలబీజముగ నుండుటకు భగవంతుఁడు తోడ్పడుఁగాత!

చెన్నపురి రాష్ట్రాధికారుల నిరంకుశకార్యములు, ముఖ్యముగ బిసెంటమ్మ గారి నిర్బంధప్రవాసము, విశేషమైన యశాంతిని గలిగించి స్వరాజ్యాందోళనమున కుత్తేజము గలిగించినవి. నిరంకుశాధికారమును గర్హించుచు చేసిన సభలు తీర్మానములు ప్రజల దృఢాభిప్రాయములను వ్యక్తము చేసినవి. ప్రజలు విషాదోపహతులై నిర్విణ్ణులై స్వధర్మనిర్వహణమును గనలేనపుడు వారియం దాత్మవిశ్వాసము నుదయింపఁజేసి స్వరాజ్యోద్యమము నుద్ధరించిన సర్ సుబ్రహ్మణ్యయ్యరు భారతీయుల సన్మానసంస్మరణములకు పాత్రుఁడు. వర్తమానకాలమునందు జాతీయస్వాతంత్ర్య ధర్మము జాతీయసంరక్షణధర్మము స్వయంనియోగ ధర్మము లోకము నాకర్షించుచున్నవి. ఈ ధర్మములను స్థాపించుటయె మహాసంగ్రామమునకు ఫలము. కాళయుక్తి సంవత్సరాది సంచికయందు ప్రచురించిన వ్యాసములలో ప్రజల చిత్తంబుల నాకర్షించిన స్వరాజ్యస్థాపనవిషయము ప్రముఖము. సంచికయందు ముప్పది వ్యాసములు కొన్ని పద్యములు ప్రచురితములు. అందు 10 వ్యాసములు స్వపరిపాలనాది జాతీయ సమస్యలకు సంబంధించినవి గలవు. వ్యాసములందలి విశాలభావములు ప్రజాశయంబులను ఆంధ్ర ప్రపంచ ప్రబోధమును విశదము చేయుచున్నవి. సంచికయందు 150 చిత్రపటములు ప్రచురితములు. చిత్రపటములందు ఆంధ్రుల రాయబారము భారతమహిళల రాయబారము స్వరాజ్య ప్రతినిధుల రాయబారము రాజ్యాంగసంస్కరణ విచారణోపసంఘము (రాజప్రతినిధి మాంటెగు భూపేంద్రనాథ బాసు చార్లెసు రాబర్ట్సు చెన్నపురి గవర్నరు మొదలగువారు) బ్రాహ్మణేతర నాయకులు సామ్రాజ్యమంత్రులు వైశ్యనాయకులు మున్నగు విషయములకు సంబంధించినవి గలవు. లోకమాన్య తిలకు మహాత్మ గాంధి సర్ విశ్వేశ్వరయ్య రామానుజాచార్యుల చిత్రపటములు ముద్రితములు.

ముఖపటము

భారతమాతృస్వరూపము ముఖపటముగ ప్రచురింపఁబడినది. చిత్రపటమున నొక మూల బ్రిటీషు పతాకమును మఱొక మూల స్వరాజ్య పతాకమును గలవు. ఇరు పార్శ్వములందు హిందూ బౌద్ధ దేవాలయముల పటములును మహమ్మదీయ క్రైస్తవ ప్రార్థనా మందిరముల పటములును రాజదంపతుల పటములును గలవు. మధ్యభాగమునందు కమలాసన తేజోమూర్తి చతుర్భుజ భారతమాత విరాజిలుచున్నది. భారతమాత తన హస్తములందు బ్రిటీషుపతాకసహితమైన స్వరాజ్యపతాకమును త్రిశూలచక్రములను అక్షమాలను గలిగియున్నది. ఈ ముద్రలు మాతృదేశబలమునకు సామ్రాజ్యరక్షణమునకు భారతీయవిజ్ఞానమునకు చిహ్నములు. భరతఖండమునందు ప్రపంచవ్యాప్తములైన ముఖ్యమతములకు జాతులకు సంయోగము సాహచర్యము గలిగినది. భారతమాతకు హిందువులు బౌద్ధులు మహమ్మదీయులు క్రైస్తవులు ఆత్మగర్భసంజాతులైన భారతీయులు. జాతి మత విలక్షితులైన దేశభక్తిని సోదరప్రేమను అక్షమాలాకృతిని భరతమాత బోధించుచున్నది. ఆత్మసంరక్షణయోగ్యములైన చక్రమును శూలమును ఉభయహస్తములందును ధరించిన భరతమాత సుబలత్వమును ప్రకటించుచున్నది. మహాజ్వాలంబును మహాబలయుతంబును దివ్యంబును నైన మాతృస్వరూపపు సంకీర్తనము సంభావనము సందర్శనము ఫలితమైన దేశారాధనమునకు సాధనములు. పాలకపాలితులు స్వప్రయోజన విముఖులై మాతృదేశారాధనపరాయణు లగుటకు హిందూదేశమంత్రి మాంటెగు గా రచిరకాలమున ప్రచురింపనున్న రాజ్యాంగ సంస్కరణ విధానము విశాలమై దూరాధిరూఢమై స్వరాజ్యస్థాపనమున కనుకూలమై భరతవర్షాభ్యుదయమునకును బ్రిటీషుసామ్రాజ్యబలమునకును లోకకల్యాణమునకును మూలబీజముగ పరిణమించుఁగాత!

అమూల్యమైన వ్యాసములను వ్రాసియు చిత్రపటములను పంపియు నితర విధముల సహాయమును చేసియు కాళయుక్తి సంవత్సరాది సంచికను ప్రచురించుటకు తోడ్పడిన మహాజనుల కనేకవందనంబులు.

కాళయుక్తి సంవత్సరమున నాంధ్రులు సంకల్పసిద్ధులై కామితార్థములను పడయుదురుగాత! సర్వేశ్వరుఁడు సమస్తలోకములకు సుఖమును శాంతిని ప్రసాదించుఁగాత!

# లోకవృత్తాంతము

సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః - అనేన ప్రసవిష్యధ్వ మేష వో ఽస్త్విష్టకామధుక్.

విశ్వ మనంతము. ఆద్యంతరహితము. అనంతరూపపరిశోభితము. విచిత్రరూపపరికల్పితము. ఆత్మాధిష్ఠితము. ఆత్మభాసితము. ఆత్మస్థము. విశ్వావృతంబు లైన భావములు రూపములు ప్రజావికాసమునకై నిర్మింపఁబడినవి. విశ్వవికాసమునందు యుగములు మహాయుగములు మన్వంతరములు గతించినవి. దేశములు ఖండములు గోళములు గ్రహములు తారాగణములు నశించినవి. జీవజాలములు విలయము నొందినవి. విలయపరంపరలు పునర్నిర్మాణంబునకు సాధనంబు లైనవి. చరాచరరూపంబు లైన జలచరములను భూచరములను ప్రజావికాసమునకై సష్ట సృజించి తన్మూలమున ప్రజావికాసంబును నిర్దేశించెను. ప్రజాప్రసవప్రయత్నములందు జీవజాలంబులకు సంరంభము సాధారణసాధనంబుగ వినియోగించుచున్నది. చరముల పోషణమున కచరము లాధారములు. జంతువుల పోషణమునకు ఉద్భిజ్జము లాధారములు. ఉద్భిజ్జములు జంతువులు మనుజుల దేహపోషణమున కాధారములు. మనుజులు పితృలోక పోషణమునకును దివ్యపురుషుల పోషణమునకును ఆధారభూతులు. ప్రజాప్రసవమునకును ప్రజోపభోగమునకును వ్యాప్తం బైన లయవృత్తంబునం దాద్యంతనిర్ణయము దుర్లభము. లయమునందు సృష్టియు సృష్టియందు లయమును ప్రకృతిసిద్ధములు. ప్రజావికాసార్థము సంప్రాప్త మైన సంరంభపరిణామము దుఃఖమయము, శోకాన్వితము. ప్రపంచపరిణామము దుఃఖశోకమయం బై సమ్మోహమును గలిగించుచున్నది. సామ్రాజ్యములు నశించినవి, నశించుచున్నవి. జాతు లంతరించినవి, అంతరించుచున్నవి. ప్రజలు దుఃఖపరంపరల ననుభవించిరి, అనుభవించుచున్నారు. దుఃఖశోకసాగరతరణము దుస్తరముగ నున్నది.

## యజ్ఞారాధనము

అవతారపురుషు లీ పరమరహస్యమును లోకసంగ్రహార్థము వెల్లడి చేయుటకై! తమ జీవితంబులను వినియోగించిరి. బుద్ధదేవుఁడు ప్రపంచమును తరింపఁజేయుటకై సంపదలను రాజ్యమును సంసారమును పరిత్యజించెను. ఏసుక్రీస్తు మానవుల ముక్తికై ప్రాణములను సమర్పించెను. శ్రీకృష్ణుఁ డాత్మసిద్ధికి యోగమార్గమును జూపెను. సకలవేదములు సకలశాస్త్రములు సకలకర్మములు ప్రజల జీవితసాఫల్యమునకు సాధనంబులుగ నున్నవి. ఈ పరమార్థగ్రహణము సుఖమునకును విపరీతగ్రహణము దుఃఖమునకును మూలములు. ప్రజల ప్రసవమునకై సర్వేశ్వరుఁడు మహాయజ్ఞమును ప్రసాదించెను. ఆ యజ్ఞమును ప్రజలు జాతులు తమ సంస్కారమునకును దేశమునకును కాలమునకును తగిన రీతి ననుష్ఠించుచు సుఖదుఃఖముల ననుభవించుచుందురు. యజ్ఞరూపము లనంతములు. కర్మయజ్ఞము తపోయజ్ఞము యోగయజ్ఞము స్వాధ్యాయ యజ్ఞము బ్రహ్మయజ్ఞము యజ్ఞమునకు వివిధాంగములు. యాజకులు యజ్ఞరూపమునకు సదృశ మైన ప్రతిఫలమును పడయుదురు. స్వార్థపర మైన యజ్ఞము పాపమునకును దుఃఖమునకును బంధనమునకును, పరార్థపర మైన యజ్ఞము పుణ్యమునకును సుఖమునకును మోక్షమునకును హేతుభూతములు. యజ్ఞవిదులు యజ్ఞశిష్టామృతభుజులు సుఖమును శాంతిని బ్రహ్మత్వమును పడయుదురు. యజ్ఞవిముఖులు యజ్ఞఫలభుక్కులు దుఃఖమును నాశనమును పొందుదురు. వివిధము లైన యజ్ఞములకు కర్మములు మూలబీజములు. యజ్ఞములందు ద్రవ్యయజ్ఞము లధమములు. జ్ఞానయజ్ఞములు శ్రేష్ఠములు.

స్వార్థపర మైన ద్రవ్యయజ్ఞపు ఫలము వర్తమానమహా

దారుణసంగ్రామమునందు సందర్శనీయము. ద్రవ్యయజ్ఞజనకమైన భోగఫలము దారుణము, విపరీతము. త్యాగఫలము సౌమ్యము, పరమార్థము. యజ్ఞాచరణమునకు చతుర్వింశతితత్త్వరూపంబైన దేహము క్షేత్రము. మనోబుద్ధిచతుర్వింశతితత్త్వంబులు సాధనంబులు. తత్త్వసిద్ధి మహాఫలము.

యజ్ఞభావము విశాలము. విశ్వము యజ్ఞరూపభావంబునందు ప్రక్షిప్తము. దేహబలవికాసమునకు కర్మయజ్ఞములును ద్రవ్యయజ్ఞములును మనోబుద్ధివికాసమునకు దానాధ్యయనతపోయజ్ఞములును ఆత్మోపలబ్ధికి ఆత్మయజ్ఞమును పరికల్పితములు.

"త్వం బ్రహ్మ త్వం యజ్ఞ స్త్వం లోకః"
"యేనైకేన యజ్ఞా స్తేషాం సర్వేషాం యజ్ఞ ఇత్యేకతా"

—బృహదారణ్యకము.

సకలయజ్ఞములకును ఫలము ఆత్మవిజ్ఞానము. ఆత్మజ్ఞానోపలబ్ధికి ప్రతిబంధకములైన యజ్ఞములు భయావహంబులు. ఆత్మజ్ఞానోపలబ్ధికి సాధనంబులైన యజ్ఞములు ముదావహంబులు.

### ప్రాచ్యవిజ్ఞానము

ప్రాచ్యప్రపంచమునందు ముఖ్యముగ భరతఖండమున సకలయజ్ఞములు ఆత్మసామ్రాజ్యప్రాప్తికి నియమితములు. లోకవ్యాప్తములైన మహామతములు ప్రాచ్యదేశసంజాతములు. ప్రాచీనతమంబైన హిందూమతమునకు భరతఖండము జన్మస్థానము. ఏకేశ్వరోపాసనవిరాజితంబైన యూదుమతమునకును త్యాగప్రదంబైన క్రైస్తవమతమునకును ఆసియాఖండము జన్మస్థానము. అహింసాధర్మమును ప్రతిపాదించిన జైనబౌద్ధమతములకు ఆర్యావర్తము జన్మస్థానము. మతభ్రాతృత్వమును ప్రతిపాదించిన మహమ్మదీయమతమున కాసియాఖండము వాసస్థలము. బ్రహ్మజ్ఞానప్రదంబులును జీవేశ్వరతత్త్వప్రతిపాదకంబులునైన ద్వైతాద్వైతసిద్ధాంతంబులకు భరతఖండము నిలయము. తత్త్వపరిశోధనమునందు భారతీయమహర్షు లగ్రగణ్యులు. పాశ్చాత్యతత్త్వవేత్తలు కాంటు స్కోపా హోవర్ టాల్‌స్టాయి ప్రభృతులు ఉపనిషదమృతంబు నాస్వాదించి జీవితపరమార్థమును కనుఁగొనిరి. ఆధ్యాత్మికతత్త్వవిచారణమునందు భారతీయతత్త్వజ్ఞులను మించిన తత్త్వజ్ఞులు లోకమునందుఁ గానఁబడరు. పాశ్చాత్యతత్త్వశాస్త్రమునకు మూలాధారమైన యవనతత్త్వశాస్త్రమునకు భారతీయతత్త్వశాస్త్రమె మూలాధారము. ఆర్యులకు సకలసంస్కారములును ఆత్మాధిష్ఠితములు. అన్నము బ్రహ్మము. ఉదకము బ్రహ్మము. కర్మము బ్రహ్మము. విశ్వమంతయు బ్రహ్మమయము. విశ్వమునందు బ్రహ్మాతిరిక్తంబైన పదార్థము అదృశ్యము. పరమేశ్వరుఁడు సర్వాంతర్యామి. పాశ్చాత్యమతబోధకులు బోధించెడి రీతిని సర్వేశ్వరుఁడు స్వర్గవాసి మాత్రమె గాఁడు. బ్రహ్మాధిష్ఠితంబైన విశ్వరూపమునందు బ్రహ్మతత్త్వజ్ఞానము జీవితపరమార్థము. బ్రహ్మము నిత్యము, సత్యము. విశ్వము అనిత్యము, అసత్యము. అస్తిభాతులందు అస్తి నిత్యము భాతి అనిత్యము. ఆనందము జ్ఞానవైరాగ్యములందు సాధ్యము గాని తృష్ణోపభోగములందు సాధ్యము గాదు. ప్రాచ్యులకు జీవితపరమార్థము వైరాగ్యము. పాశ్చాత్యులకు జీవితపరమార్థము తృష్ణావిలసనము. ప్రజలకు సుఖము శాంతి ఇంద్రియార్థముల వైరాగ్యమునందు సాధ్యము గాని తృష్ణాపూరణమునందు సాధ్యము గాదు. పాశ్చాత్యుల యాదర్శము ఆధిభౌతికము. పాశ్చాత్యుల సర్వారంభములకును భౌతికవికాసము ఫలము. విజ్ఞాన మాధిభౌతికము. జీవిత మాధిభౌతికము. దివ్యాంబరములు సుందరమందిరములు మృష్టాన్నములు మాంసాశనము మద్యపానము భౌతికబలవికాసమునకు తోడ్పడినవి. స్వోత్కర్ష దురభిమానము అహంకారము మమకారము పాశ్చాత్యరాజ్యధర్మమునకును జాతీయసిద్ధాంతమునకును వర్తమానదారుణ సంగ్రామమునకును మూలబీజములు.

ప్రాచ్యుల యాదర్శము ఆధ్యాత్మికము. ప్రాచ్యుల సర్వారంభములకు ఫల మాధ్యాత్మికము. విజ్ఞాన మాధ్యాత్మికము. జీవిత మాధ్యాత్మికము. కాషాయాంబరములు పర్ణశాలలు ఫలాహారము శాకాన్నము ఆత్మజ్ఞాన

# సాత్త్వికనిరోధము

వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారు, బి. ఏ., బి. ఎల్., ఎల్. టి.

మన రాజకీయాందోళనమందు సాత్త్వికనిరోధమను నది నిబంధనానుకూలాయుధములలో ప్రధానమైన దని గాంధిగారు దక్షిణాఫ్రికాలో జరుపఁగలిగిన చర్యలవలన మనవారు గ్రహింపఁగలిగిరి. కాని, పెక్కువేల సంవత్సరములనుండి మన దేశీయులు బలవంతుల దౌర్జన్యమును బాపుటకు దీనిని జయప్రదముగ నుపయోగించుచుండినట్లు మన పురాణములు మొదలగు పూర్వచరిత్రలవలన స్పష్టపడుచున్నది.

శరీరబలముకంటె ఆత్మబలము పెక్కుమడుంగు లెక్కువ బలీయమైనది. రాజకీయబాధలను గాని మరి యే యితరబాధలను గాని తొలఁగించుకొనఁదలఁచినపుడు జనులు తమ యాత్మబలమునే సదా యుపయోగించుచున్నయెడల, ఇప్పటి యనవసరపు కష్టములకు మనము లోనుగాకుండియుందుము. ఒకానొకప్పుడు బలము నుపయోగించుటవలన జయప్రదమగు ఫలములు త్వరలో కనిపింపకపోయినను బాధ లేదు. పరిపాలకులకుఁ గాని ఇతరప్రజలకుఁ గాని ఏ విధమైన హానిని కలుగఁజేసినవారము కాము. మనమే యిడుముల నొందుదుము. దీనిలో అపజయ మనునది లేనే లేదు. దీని నుపయోగించిన కొలఁది మనుజుఁడు మరింత ధైర్యవంతుఁడై క్రమక్రమముగ తాను స్వార్థత్యాగమూర్తి యగుచుండును. న్యాయముకొఱకు ఈ శక్తిని ప్రయోగించునపుడు దీనిని శరీరబల మెంత గాఢముగ నెదుర్కొన్నను తుదకు సత్యము జయించితీరును. ఈ యాత్మబలము నుపయోగించువారు అనేకకష్టములకు పాత్రులైనప్పటికిని ఆ కష్టములే వారికి ఆనందజనకము లగుచుండును. కాబట్టి, ఈ యాయుధము నుపయోగించువారు ధనదారపుత్రాదులను లక్ష్యము చేయక మిక్కిలి ధైర్యవంతులుగ నుండవలెను. వీరు తమ శరీరబలము నుపయోగించి, ఇతరుల నెన్నటికిని ఎంత మాత్రమును బాధ నొందింపఁగూడదు; 'అహింసా పరమో ధర్మః' యను నీతివాక్యమును మఱువఁగూడదు.

తన శరీరముకంటె తన యాత్మ వేఱుగా నున్నదని గ్రహించినవాఁడే ఈ శక్తి నుపయోగింపఁగలఁడు. తన ప్రభువుల యాజ్ఞలు న్యాయమైనవి కావని తాను త్రికరణశుద్ధిగ నమ్మినపుడు వాని నుల్లంఘించుటలో తన ప్రాణము నైనను గోల్పోవుటకు సంసిద్ధుఁడుగా నుండవలెను. ఇట్టివాఁడు తన శత్రువులను కూడ ప్రేమింపఁగలఁడు. ఒక రక్తపు బొట్టయిన పడకుండ, ప్రయోక్తలను లక్ష్యభూతులను కూడ తరింపఁజేయఁగల మహాద్భుతశక్తి ఈ యాత్మశక్తియే యని చెప్పక తీరదు. ఇది అనేకధారలు గల వాడియైన కత్తి. దీని ప్రయోగమువలనఁ గలుగు ఫలములు బహుదూరము వ్యాపింపఁగలవు. ఈ కత్తి త్రుప్పు పట్టదు. దీని నెవరును దొంగిలింపలేరు. ఈ కత్తి నుపయోగించువారిలో ఎంత పోటీ యేర్పడినను, వారికి అలసట యనునది యుండనే యుండదు. ఈ కత్తికి ఒఱ లేదు. దీనిని బలవంతముగ ఎవరును లాఁగుకొని పోలేరు.

రాజకీయసంస్కరణములు కావలె ననువారు స్వార్థత్యాగులై యుండవలెను. వీరు ఏ విధమైన దౌర్జన్యము నుపయోగింపక తామే కష్టముల ననుభవించుటకు సిద్ధముగ నుండవలెను. అసూయను తమ ప్రేమచేత జయింపవలెను. మోటు బలమైన శరీరబలమును తమ యాత్మశక్తిచేత జయింపవలెను. మనుష్యమాత్రులైన రాజులయందలి భక్తి దైవభక్తికి లోఁబడవలెను. మానవనిర్మాణముకంటె దైవనిర్మాణము వేఱుగా నున్నదని తన మనస్సాక్షి గట్టిగ బోధించుటచేత, మొదటి దానికి తాను లోఁబడనపుడు, ఒకవేళ తన యభిప్రాయము పొరబాటయినను, తానే బాధలను పొందును గాని ఇతరులకు ఎట్టి కష్టములను కలుగఁజేయఁడు. తా నట్టి బాధలను పొందుచున్నను, రాజ్యాంగనిర్మాణము యథాప్రకారము నెమ్మదిగా దానియంతట నది సాఁగిపోవుచుండును. ఒకవేళ తన యభిప్రాయమే న్యాయమైనదైనయెడల, పరిపాలకులు ఏర్పఱచిన శిక్షలకు మిక్కిలి సంతోషముతో తాను లోఁబడి భవిష్యత్ఫలములను కాలమునకును బహుజనాభిప్రాయమునకును వదలివేయుచుండును.

ఈ యాత్మశక్తి నుపయోగించుటకు ప్రతివాఁడును

తగఁడు. గాంధి తిలకు మహారాజుల వంటివారు అరుదుగ నున్నారు. ఈ యభ్యాసములో శిక్షితులై యున్నఁ గాని నిర్భయత్వ మలవడదు. మనము పిఱికిపందల మగుట ఇతరులను హింసించుటకు శక్తి చాలనివార మగుటవలన కాదు, చచ్చుటకు ధైర్యము లేకపోవుటవలననే. పాశ్చాత్యదేశములలోవలెనే, మన యిండియా దేశములో కొందఱు అరాజకులు బయలుదేఱి తమ దేశమునకు హాని కలిగించుచున్నా రని దురభిప్రాయపడి ఇతరులను హత్య కావించుచుండిరి. వీరు సదుద్దేశముతో దేశసేవ చేయుచున్నా మనెడి దుర్భ్రమ కలిగి ఇట్టి దుష్టకార్యములను చేయుచున్నారు. కాని, వీనివలన ఎట్టి ప్రయోజనమును లేదు సరి కదా, వీరు తమ దేశమును మరింత కష్టముల పాలు చేయుదురు. ఇట్టివారు నిస్సందేహముగ పిఱికిపంద లని చెప్పవచ్చును. తమ కడుపులో నున్నదానిని వెలికిఁ గ్రక్కలేక, జైలునకు పోవుటకు సిద్ధముగా నుండఁజాలక రహస్యముగ నిరపరాధులను నిష్కారణముగ చంపి వీలైనయెడల తప్పించుకొని పాఱిపోవుటకు ప్రయత్నించువారిని ధీరు లని యెట్లనఁగలము? ఇట్టి హంతకులు స్వరాజ్యపరిపాలనమును మాత్రము సాగనిచ్చెదరా? వీరు తమ దేశమునకుఁ గాని తోడి మానవులకుఁ గాని తుదకు తమ యైహికాముష్మిక సుఖములకుఁ గాని యెట్లు తోడ్పడఁజాలుదురు?

ఈ సాత్త్వికనిరోధమునే సత్యాగ్రహ మని గాంధిగారు గుజరాతీభాషలో వాడుచున్నారు. ఇది మతసంబంధ మైన యాయుధము. మతమందు నమ్మకము గలవారే దీనిని తెలివితోను ధైర్యముతోను ఉపయోగింపఁగలరు. ప్రహ్లాదుఁడు అంబరీషుఁడు మీరాబాయి మొదలగువారు సాత్త్వికనిరోధకులే. పాశ్చాత్యులు తమ భుజశక్తిచేత స్వరాజ్యమును సంపాదించుకొనఁగలిగిరి. దానిచేతనే, వారి స్వాతంత్ర్యమునకు భంగము కలుగవచ్చును. మన యిండియా దేశమువారు తమ యాత్మబలముచేతనే దానిని సంపాదించుకొనవలసియున్నది. ఎట్టి కృషియు లేక ఉచితముగా ఈయఁబడిన స్వరాజ్యము స్వరాజ్యమే కాదు. దాని నెప్పుడు నిలుపుకొనఁజాలము. ప్రజలు తమ శక్తిని తాము తెలిసికొనఁజాలనపుడు వారిలో నిజ మైన యుద్బోధ కలుగనే కలుగదు.

సాత్త్వికనిరోధి తన పరిపాలకులకు ఎట్టి తొందరను కలిగింపఁడు. అవిధేయుఁడుగ నెప్పుడు కనఁబడఁడు. పాలకులు తప్పులు చేయుచున్నా రని తాను నమ్మినపుడు, వారి యకార్యకరణములను బహిరంగముగ నిర్భయముగ విమర్శించును. శిక్షాస్మృతులకు వ్యతిరేకముగ నడచినాఁ డని పాలకులు విధించు శిక్షలను సంతోషముతో అనుభవించును. రాజులకు భయపడి తన విధాయకకృత్యములను విడువఁడు. సహింపఁదగిన కష్టములకు సర్కారువారికి పిటీషనులు పెట్టుకొనవచ్చును గాని, సహింపఁగూడనివానిని తొలఁగించుటకు సాత్త్వికనిరోధముకంటె మేలైన యాయుధము లేదు. దీనికి రాజాధిరాజులు కూడ తప్పక లొంగిపోవుదురు.

ఈ సాత్త్వికనిరోధయుద్ధము బలహీనుల కేర్పడిన దని తృణీకారముగ కొందఱనెదరు. యుద్ధరంగమునం దుండు సైనికునికంటె ఈ సాత్త్వికనిరోధి యెక్కువ ధైర్యవంతుఁడుగా నుండవలెను. మొదటివానిది తాత్కాలికముగ కలుగఁజేసికొన్న శౌర్యము. ఈతనిది యావజ్జీవము పెంచి పోషింప వృద్ధి యగుచుండు శౌర్యము. నిజము మాట్లాడిన రాజద్రోహదోషమైనను, నిజమునే ధైర్యముగ పలికి శిక్ష నొందుటకు సిద్ధపడినవాఁడే నిజ మైన సాత్త్వికనిరోధి. ఇట్టివానితో పెక్కువేలమంది కారాగృహమునకు పోవుటకు సిద్ధముగా నుందురు.

ఈ సాత్త్వికనిరోధము ఒకే సమయమందు ఒకే స్థలమందు పెక్కుమంది కలసి చేయవలసియుండు ననియు, సర్కారుద్యోగములను ఒకేసారి మానివేయుట పన్నుల నందఱు ఒకేసారి నిరాకరించుట జరుగవలె ననియు, ఇట్టి యైకమత్యము మన దేశములో రాఁజాల దనియు, కాఁబట్టి సాత్త్వికనిరోధాయుధమువలన రాజకీయసంస్కరణములు కలుగుట తటస్థపడ దనియు కొందఱి యభిప్రాయము. వీరు సాత్త్వికనిరోధతత్త్వమును సరిగా గ్రహింపలేదు. సర్కారువారిమీఁద ఒక్కసారిగ కొంతమంది ప్రజలు కుట్రచేసి కత్తి కట్టవలసియుండు ననుట తప్పు. పాలకులమీఁద ఏ విధ మైన యసూయ గాని మన కుండఁగూడదు. ఎవరు తనతో చేరినను చేరకపోయినను తన విధ్యుక్తకార్యమును తాను చేయుచు, సర్కారువారు విధించు శిక్షలను ధైర్యముతో ననుభవించుటకు సిద్ధముగా నున్న వ్యక్తియే సాత్త్వికనిరోధి. తనతో పెక్కుమంది చేరినయెడల తనకు శిక్ష తప్పునేమో యని యెదురుచూచుచుండెడివాఁడు ఈ సాధనము నుపయోగించుటకు తగఁడు.

ఆ. మధ్యవల్లి పెట్టె మంజరిద్విపదఁ బ
ల్నాటివీరచరిత వాఁ డెనఁచితి
నది స్వతంత్రకావ్య మని యేరు మెచ్చురో
వంగవలెనొ? కవులనాథపాత్ర! 17

తే. ఎఱచిఁ దినువార లేనియు నెమ్మి మెడకుఁ
గట్టుకొందురె? శ్రీనాథకవివరేణ్య!
సానికూఁతుల తగుల మీ శాసనమును
బలికితివి నీ స్వభావము బయలుగాను! 18

తే. టంకములఁ దీర్థ మాడి కడాని గిన్నె
లందు భోజన మొనరించి యందలంబు
లెక్కి తిరిగిన గొప్ప కవీశ్వరుండె
యౌను శ్రీనాథుఁడు, గుణాఢ్యుఁ డగునొ? కాఁడొ? 19

తే. ప్రాలుమాలిక చేఁ దాళపత్ర పుస్త
కాటవుల వర్థపుం దెరువాట్లు గొట్టి
కోఱలఁబడు నని శుకవిని గొసరి తిట్టి
పెద్దన యొనర్చినట్టి తప్పిదము సడియె. 20

తే. మారన కథావిధానముఁ జూఱలాడి
కోరి శ్రీనాథు తెనుఁగులఁ గొల్లగొట్టి
మనుచరిత్రం బొనర్చి పెద్దన గడించె
నాంధ్రకవితాపితామహుం డన్న బిరుదు. 21

ఆ. మనుచరిత్ర మందుకొని రాజు పెద్దన
పల్లకిఁ దన కేలఁ బట్టి యెత్తె
నడిగినట్టు లగ్రహారంబు లిడె ముక్కు
తిమ్మనార్యుకంటె దిట్టఁ డనియొ? 22

తే. తనకు నంతఃపురమునకు మనసులందు
నెడమడుగు పుట్టి ముద్దు లొల్కెడు నుడులను
పారిజాతాపహరణంబుఁ బల్కి మాన్పి
నట్టి తిమ్మన ఋణము రా జెట్టు తీర్చు? 23

తే. కృష్ణరాయఁడు చేసిన విష్ణుచిత్త
కావ్యమందలి భావము క్రొవ్వె యగు;
నెన్ని మార్లు పఠించిన నెఱుక పడని
నట్టి పాషాణపాక మెవ్వండు సదువు? 24

తే. శ్లేషకావ్యంబుఁ జేసి విశేషయశముఁ
గనిన పింగళి సూరన గడుసువాఁడె
కాని, శుభమస్తని యు. దేమి? - గారుడంబుఁ
దెలుఁగుఁ జేసినవాఁడు వైదికుని పగిది. 25

తే. కవపథోరణి కల్పనాగౌరవంబు
శబ్దసౌష్ఠవమును లెస్స సంబరంబె;
భోగఁపుఁబడంతులా కలాపూర్ణకథకు
నెత్తిన ప్రధాననాయిక? లెంత తప్పు! 26

తే. తగని గర్వంబునం జేసి తన్నుఁ దానె
పొగడుకొనువాఁ డటంచుఁ జెప్పుదురు గాక,
వాలి పలుకులు రావు తెనాలిరామ
కృష్ణకవి నోట బంగారు గిలకదీట. 27

తే. ఒకఁడు స్వప్నప్రకారము నుగ్గడింప
నెల్లవారలకుఁ గలలె తెల్లవార్లు -
నప్పుడు రసు కలంపు లే దెవ్వరికిని
పేరుకొన నేమిటికి నట్టి తీర కవుల? 28

తే. దేవతాప్రార్థనంబును దేశనగర
రాజవర్ణనములు కథారచన యంత
త్రొక్కి విడిచిన పుంతయే దిక్కుమాలి
కవనమును జెప్పదిగిన ప్రజ్ఞానిధులకు. 29

క. గాసటబీసట వేలుపు
బాసం బఠియించి యాంధ్రభాషాగ్రంథా
భ్యాసము లేకయె తెలుఁగులఁ
జేసెద మనుచుందు రబుధులు సిగ్గెఱుఁగరొకో? 30

తే. పూర్వకవిరాజులకు నిది భూషణంబొ
దూషణమొ యనుకొనుఁడు మీ తోఁచినట్లు;
నన్నయాదుల పట్ల మాకన్నఁ గూర్మి
గలుగువారలు లేరు జగమ్మునందు. 31

తే. భద్రనగరాంధ్రవిద్వత్సమాజదత్త
నూత్నవిషయక్రియాలబ్ధరత్నఖచిత
హేమబిరుదాభిరాములు రామకృష్ణ
రచయితలు పీఠపురయువరాజగురులు. 32

ఉ. అక్కలు కట్టుకొన్న గతి రివ్వన నేఁగుదు వంచు కాలమా!
ఎక్కడి వ్రాసెనొక్కొ? భరియింపఁగరాని వియోగబాధ వాఁ
డొక్క నిమేషమున్ బడసియుండఁడు, నిక్కము; కాకయున్నచో,
నిక్కరణిన్ రచించునె యెంతటి జ్ఞానవిహీనుఁ డేనియున్? — కా. గో. రా.

Mr. AUSTIN CHAMBERLAIN



ఆస్టిను ఛేంబరులేను గారు

SIR JOHN FORREST



సర్ జాను ఫారెస్టు గారు

Mr. ROBERT ROGERS



రాబర్టు రోజర్సు గారు

Mr. W. F. MASSEY



డబ్లియు. ఎఫ్. మాసి గారు

Dr. BETHMAN HALLWEG



డాక్టరు బెత్మను హాల్వెగ్గు గారు

HON. ROBERT LANSING



గౌ. రాబర్టు లాన్సింగు గారు.

HON. JOSEPHUN DANIELS



గౌ. జోసిఫన్ డానియల్సు గారు

HON. NEUTON D. BAKER



గౌ. న్యూటన్ డి. బేకరు గారు

HON JAMES W. GERARD



గౌ. జేమ్సు డబ్లియు. జిరార్డు గారు

KING ALEXANDER OF GREE'E



గ్రీసు దేశపు రాజు అలగ్జాండరు గారు

THE GREEK ROYAL FAMILY



గ్రీసు దేశపు రాజకుటుంబము

JOAND'aRC AT RHEIMS



రీమ్సువద్ద జోన్డి ఆర్కు గారు

GEORGE WASHINGTON



జార్జి వాషింగ్టను గారు

# మోటారుబండ్లు, మోటారుత్రొక్కుడు బండ్లుగల

మహానుభావులారా!



ఈ సంవత్సరము ప్రపంచమం దంతటను ఘోర సంగ్రామముతో కూడుకొనుటచే మీ బండ్లకు వలయు పరికరములను కొనుటలో మీరు కొంచెము జాగ్రత్తగ నుండవలయును. కొంచెము నిదానించవలయును. మోటారుబండ్ల పరికరములు అనేకమార్పులను జెందినవి. కాన మంచివి గొనుటలో విశేషపరిజ్ఞాన ముండవలయును. మంచి వానిని కొనుటలో గూడ అనుభవము కలిగియుండ వలెను. సరియైన ధరలు, నమ్మకమైన వస్తువులు వలయు నన్న మా పేర వ్రాసి తెలిసికొనుడు. క్రొత్తవిధానములతో మేము పరీక్షించి మీకు సౌకర్యములను కలుగజేయుగలము. అనుభవశాలు రగు ఇంజనీరులు గూడ మా వద్ద నున్నారు. 25 ఏండ్లనుండి సైకిలులను అమ్ముచున్నారము. మరమ్మతు చేసి విఖ్యాతిగడించినారము. 15 సంవత్సరములనుండి మోటారుబండ్ల నమ్ముచున్నా రము. మా వద్ద ఈ క్రింది బండ్లు వాని పరికరములు ఎల్లప్పుడును ఉండును.

| | | | | |
|---|---|---|---|---|
| మిచిలిన్ బండి, సైకిలు టైరులు | ల్యూకాస్ సైకిలు మోటారు పరికరములు | ప్రైస్సెన్స్ వ్యాక్యూం యితర మంచి చమురు | ఆశ్చర్యకరమగు నునుపు నిగారింపు జేయు పదార్థము | డైనమో బ్యాటరీలు మాగ్నిటోను మొదలితర పరికరములు |

మీ బండ్లకు రంగుగాని మరమ్మతుగాని వలయుచో మా కంపుడు. సరిపరచి మీ కప్పగించెదము.

(10)

## అడీసన్ కంపెనీ, మదరాసు.

మేము వందలకొలది నేర్పరులగు పనివారలను మోటారుబండ్ల పనియందు ప్రముఖులగు యూరపియనుల విచారణక్రింద నియమించి ఆరోగ్యవంతము లగు మందిరములందు పని చేయించుచుందుము.

డైరక్టరులు:— టి. లూకర్, డబ్ల్యు. హెచ్. లూకర్, ఎ. టి. లూకర్.

# అడిసన్

40 ఏండ్లనుండి దక్షిణ హిందూస్థానమున మేము వర్తకము చేయుచున్నారము. ప్రతి సాలున మాకు క్రొత్తబేరములు వచ్చుచున్నవి. పెక్కు మిత్రులు ప్రోత్సహించుచున్నారు. ప్రతి సాలున మా అమ్మకము ద్విగుణీకృత మగుచున్నది. మీ రేమైన మా వద్ద కొనిఉంటిరా? మీ స్నేహితుల చాలమంది గడియారములు ఫౌంటెన్ కలములు సైకిలు మున్నగునవి మావద్ద కొనియున్నారు. వారి నడిగి తెలిసి కొనుడు. ఈ క్రింద నుదాహరింపబడిన వానిలో మీ యిష్టమైన వాని నెన్నుకొనుడు. ఈ పుస్తకము పేరు సూచించి వ్రాసినచో వివరములను తెల్పెదము:—



## అడిసన్ అండు కో.,

మౌంటు రోడ్డు,

మదరాసు.

(10)a

## అండు కంపెనీ మదరాసు.

గడియారము

వెండి నికెలు బంగారము

రూ. 2/8—1000.

ఫౌంటెన్ పెన్ను

స్వాన్, ఒనోటో వాటర్మను,

బ్లాకుబర్డు. లండను ధరలు.

సైకిలు నమ్మకమైనవి

సైకిలు ల్యాంపులు

టైర్సు గంటలు మొ.

కచ్చేరి పనిముట్లు

కలము.

కాగితము

వగైరా.

ప్రైమస్ స్టవు.

అన్ని రకముల గడియారములు స్కూలు రిజిస్టరులు బిల్లులు పొందుచునవి, కప్పతాళములు, డిస్ప్యాచి పెట్టెలు, స్టీలు ట్రంకులు డ్రాయింగు పనిముట్లు కరణం, సర్వే పనిముట్లు కూడ మా వద్ద దొరకును.

# సంస్కృతభాషలోని కొన్ని విస్మృతనాటకములు

మానవల్లి రామకృష్ణకవి గారు, ఎమ్. ఏ.

అహో! పృథివి నేఁటికిని రత్నగర్భయే. వెదకెడివాఁడును భోగించెడివాఁడు నుండిన రత్నముల కేమి తక్కువ? శాకుంతలోత్తరరామచరితరత్నావళీస్వప్నవాసవదత్తములు చదివి యింక సంస్కృతభాషలో నుత్తమనాటకములు గలవా యని పెక్కండ్రు తలఁచుచున్నారు. విస్మృతిమహార్ణోరాశిలోఁ గాలపురుషుని దండఘాతమునకుఁ దూంట్లువడి మునిఁగిపోయిన కృతినౌకల నిప్పు డిప్పుడు మహాప్రయత్నముల వెలువరింపఁగాఁ గవిలోక మతి విశాల మనియుఁ గావ్యవినోదులకు విహారరమణీయము లగు నారామములు వయోబుద్ధివిద్యాదిగుణవిశిష్టుల కొక్కొకరికిఁ దగినట్లు పెక్కులు కల వనియు నిరుపాధికసుఖాసక్తుల కుద్ఘోషింపఁ జాలి నన్ని శిల్పవైచిత్రులు పొడగానవచ్చుచున్నవి. ఈ వ్యాసమునఁ గొన్ని రూపకములఁ గూర్చి ప్రస్తావించి కేవలము నామావశిష్టము లగు మఱికొన్ని రూపకములఁ జేర్కొన్నచో లోకులు వాని సంపాదించి మాసిపోవుచున్న మహాకవికీర్తిచిత్రముల కించుక మెఱుఁగు వెట్టి వానిఁ బునరుజ్జీవింపఁజేసి కృతార్థు లగుదురుగాక యని యీ యల్పప్రయత్నమునకు దిగితిమి.

మేము నిశ్చితాంశసందిగ్ధాంశముల సూచించునట్లే సర్వత్ర ప్రమాణబుద్ధితో వ్రాయఁగలము కాని యొక్కొక మాటకు నాధారములు చూపి తమకుఁ దామె స్త్రీలో పురుషులో యని సందేహము నైతము కలుగఁజాలినట్టి మహాపురుషుల మేము మెప్పింపఁ జాలము. దీనిని సంస్కృతభాషలో రచించి సర్వసామాన్యముగాఁ బ్రచురింపవలసియున్నను మాకు గీర్వాణభాషలో వచనరచనాకౌశల మలవడకుండుటయు నాంధ్రభాషపైఁ గల పక్షపాతమును నాంధ్రుల బహుపథసంచరణశీలమును నీ యుద్యమమునకుఁ గారణము లయ్యె.

ఈనడుమఁ గొన్ని నష్టప్రాయము లగు నలంకారశాస్త్రగ్రంథములు లభింప వాని శోధించితిమి. కొన్ని నాటకములు లభింపఁ జదివి యానందించితిమి. పైవానిలో శారదాతనయుని భావప్రకాశము, భోజదేవుని శృంగారప్రకాశము, అభినవగుప్తపాదుల నాట్యశాస్త్రవ్యాఖ్యానము, అమృతానందుని కావ్యాలంకారసంగ్రహము, ముకులుని యుద్భటాలంకారవ్యాఖ్యయు ముఖ్యములు. వీనిలోఁ జేర్కొన్న నాటకములు పెక్కు లుత్పన్నము లయ్యె. వానిలోఁ గొన్నిటిఁ జేర్కొని ప్రలబ్ధనాటకముల గుఱించి విస్తరించెదము.

దశమావస్థ రూపకముల వర్ణించుట నిషేధ్య మనియు నాయకమృతి పునరుజ్జీవనమునఁ బర్యవసించు నేని దుష్టము కా దని చెప్పుచు శారదాతనయుఁడు, "చంద్రాపీడస్య మరణం ప్రత్యుజ్జీవనకాంతయా। కల్పితం భట్టబాణేన యథా శారదచంద్రికా" యనెను. బాణుని శారదచంద్రికలోఁ గాదంబరీకథయే కథాశరీరము కాఁబోలు. క్షేమేంద్రుఁడు, "అంగే౽నంగజ్వరహుతవహ శ్చక్షుషి ధ్యానముద్రా। కంఠే జీవః కరకిసలయే దీర్ఘశాయీ కపోలః। అంసే వీణా కుచపరిసరే చందనం వాచి ముద్రా। తస్యాః సర్వం కృత మితి పున స్త్వాం వినా క్వాపి చేతః." అని యుదాహరించిన పద్యము కాదంబరీవిరహావస్థను సూచించు నని చెప్పుటచే శారదచంద్రికలోనిదే కావలయు.

హైహయవంశస్థు లగు కలచురిరాజులలోఁ బ్రఖ్యాతుఁడగు ననంగహర్షుఁడు తాపసవత్సరాజ మను నాటకమును రత్నావళీస్వప్నవాసవదత్తకథాభాగములఁ గైకొని రచించెను. ఇతఁడును క్రీ. శ. 7-8 శతాబ్దులలో నుండినవాఁడు. ఈ నాటకరాజము మనకు లభింపకున్నను యూరోపుదేశమున నొక్క ప్రతి యెచ్చటనో నిలిచియున్నది. దీనిలోని పద్యములు విప్రలంభకరుణరసప్రధానములుగా నానందవర్ధనభోజాదు లుదాహరించిరి. దీనిలోఁ బద్మావతి నుదయనుఁడు పరిణయమాడినను వాసవదత్తపైఁ గల మోహము నే విప్రలంభావస్థచేఁ బ్రకటించుచు హృదయమును నీరుగాఁ గరఁచు భావములు వెలువరించును. తృతీయాంకమున, లావణకాగ్నిలోఁ గాలిన వాసవదత్తను స్మరించుచు, "సర్వత్ర జ్వలితేషు వేశ్మసు భయా దాలీజనే విద్రుతే। శ్వాసోత్కంపవిహస్తయా ప్రతిపదం దేవ్యా పతంత్యా తయా। హా నాథేతి ముహుః ప్రలాపపరయా దగ్ధం వరాక్యా తథా। శాంతేనాపి వయం తు తేన దహనేనాద్యాపి దహ్యామహే." చతుర్థాంకమున, "దేవీ స్వీకృతమానసస్య నియతం స్వప్నాయమానస్య మే। తద్గోత్రగ్రహణాదియం సువదనా యాయాత్కథం నవ్యథాత్। ఇత్థం యంత్రణయా కథం కథమపి క్షీణా నిశా జాగ్రతో। దాక్షిణ్యోపహతేన సా ప్రియతమా స్వప్నేపి నాసాదితా."

విశాఖదేవుఁ డభిసారికాచండిక మను వత్సరాజపద్మావతీపరిణయవాసవదత్తావిప్రలంభము నే వర్ణించు నాటకమును రచించె. ఇందుఁ బద్మావతి పుత్రవధకు సమ్మతింపఁగా రాజు క్రింది వాక్యముల నామె హృదయము భేదించును: "ప్రదుష్టోగ్రగ్రాహం సరిత మవగాఢః శ్రమవశా। దుపాలీఢః శాఖాం ఫలకుసుమలోభాద్విషతరోః। ఫణావి......నార్థిమ్యూతపరిచయాం క్రౌర్యనిరతాం। విషజ్వాలాగర్భాం చిర మురగకన్యా మనుసృతః."

భవభూతిని మెచ్చి సమ్మానించిన కాన్యకుబ్జాధీశుఁడు యశోవర్మ రచించిన రామాభ్యుదయము షడంకనాటక మతిమనోహరముగా నుండు నని యూహింపఁదగియున్నది.

బాణుని ముకుటతాడితకమున గదాయుద్ధభాగముఁ దత్పూర్వకథయు వర్ణింపఁబడియున్నవి. భీముఁడు దుశ్శాసనవధానంతరము ద్రౌపది క్రొమ్ముడి ముడిచి "ప్రధ్వస్తాః స్యుర్ధార్తరాష్ట్రాః సవంతా త్పీతం రక్తం స్వాదు దుశ్శాసనస్య। భూర్తా కృష్ణా కేశబంధప్రతిజ్ఞా తిష్ఠత్యేకః కౌరవస్యోరుభంగః. ఊరూ నిపీడ్య గదయా యది సాద్య తస్య పాదేన రత్నమకుటం శకలీకరోమి। దేహం నిపీతనిజధూమ విజృంభమాణ జ్వాలాజటాలవపుషి జ్వలనే జుహోమి." అని శపథము సేయు భాగము భోజుఁ డుదాహరించెను.

చాణక్యచంద్రగుప్తుల కథ ముద్రారాక్షసమునందె కాక ప్రతిభాచాణక్య దేవీచంద్రగుప్త నాటకముల వర్ణింపఁబడియె. దేవీచంద్రగుప్తమునఁ జంద్రగుప్తుఁడు స్త్రీవేషము ధరించియుఁ గృతకోన్మాదమును బూనియుఁ జాణక్యునకు సహాయుఁడై రాజ్యలాభముఁ బొందినట్లు తోఁచుచున్నది. అందు నాయిక యగు వసంతసేనతో మాధవుఁ డిట్లు చెప్పెను: "ఆనందాశ్రు సితేతరోత్పలరుచో రాబధ్నతా నేత్రయోః। ప్రత్యంగేషు వరాననే పులకిషు స్వేదం సమాతన్వతా। కుర్వాణేన నితంబయో రుపచయం సంపూర్ణయో రప్యసౌ। తేనాప్యస్పృశతా పృథోనివసనగ్రంథి స్తథోద్వాసితః." మఱియుఁ జంద్రగుప్తుఁడు ప్రతివీరజనసంఖ్యఁ జూచి బెదరుచున్న విదూషకునితో నిట్లనెను: "సద్యంకాల్యాన్ పృథువర్ష్మవిక్రమబలాన్ దృష్ట్వాద్భుతాన్ దంతినో। హాసేనేవ గుహాముఖా దభిముఖం నిష్క్రామతః పర్వతాన్। ఏకస్యాపి విధూతకేసరసటాభారస్య భీతా మృగా। గంధాదేవహరే ర్ద్రవంతి బహవో వీరస్య కిం సంఖ్యయా."

త్రిలోచనమహాకవి పార్థవిజయము రచించెను. లోచనద్వయముల మగు మనకుఁ ద్రిలోచనకృతిగాంభీర్య మెఱుఁగరా దను నంత రమ్య మగు నక్కృతియు నింకను లబ్ధమైనది కాదు. దానిలో గంధర్వరాజపరిభూతుఁ డగు దుర్యోధనుని విడిపించి యర్జునుఁడు, "సైన్యైర్వో కే కురుపాండవాంతరకృతో యస్మిన్ విశేషో స్తి నః। తస్మిన్ స్తత్క్రమసాధువస్తు కథ మిత్యార్యా విజానంతి తత్। యత్త్రైకాభిజనాన్వయే త్వభిభవః క్షత్రస్య తస్మిన్ పునః। భ్రాతౄణాం పురతోభియోగసమయే పంచోత్తరం స్యాచ్ఛతం." అని చెప్పఁగా దుర్యోధనుఁడు సిగ్గువడి మాఱువలుకనోడి యెట్టకేలకు, "భ్రాతర్హమిత్యసదృశం మమ దుష్కృతైస్తైః శ్చేష్టా భవానితి తదత్ర దశావిరుద్ధం। యద్యద్బ్రవీమి వచసా నతు తత్తు తత్ర కామం భవేచ్ఛరణ మప్రతిపత్తిరేవ." యని యుత్తర మిచ్చెను.

ఇట్లె యుత్సన్నము లగు నాటకములు కృత్యారావణ, రామానంద, పాండవానంద, మాలతికా, చంద్రలేఖా, కుసుమశేఖర, సౌభద్రికా, తరంగదత్త, సముద్రదత్త, మూలదేవచరిత, చండాలరామాయణ, పుష్పభూషితక, రామానుజ, గౌరీగృహ, నళవిక్రమ, మారీచవంచిత, సుగ్రీవకేళన, దేవీపరిణయ, చైత్రావళీ, మదలేఖా, స్తంభితరంభక, మేనకానాహుష, పద్మావతీపరిణయ, సాగరకౌముదీ, గంగాధగీర థాదులు లెక్కలేనివి గలవు. పై పేర్కొనఁబడిన వన్నియు నతిప్రాచీనరూపకములు, క్రీస్తుశకము 8-వ శతాబ్దికిఁ బూర్వము పుట్టినవి కాని నవీనములు కావు.

మన కిటీవల లభించిన నాటకములలో శర్మిష్ఠాయయాతి వీణావాసవదత్తములు తక్కఁ దక్కిన వన్నియు సమగ్రముగా నున్నవి. వీనిలోఁ బ్రాచీనము లని చెప్పఁదగిన కొన్నిటిఁ గూర్చి యించుక ప్రశంసింపఁదగును. కొన్నిటిలోఁ గృతి పేరులును గొన్నిటఁ గవినామములును గానరావు.

## I కుందమాలా

దీని ధీరనాగుఁడో దిఙ్నాగుఁడో రచించెను. దీనిలోని పద్యములు వామన భోజాభినవగుప్త శారదాతనయ విశ్వనాథాదు లుదాహరించినందున నిది క్రీ. 8-వ శతాబ్దికిఁ బూర్వపుఁగృతి యని తోఁచుచున్నది. ఈ షడంక నాటకమున నుత్తరరామచరితములో వలెనే కథ కూర్పఁబడియె. విప్రలంభకరుణరసప్రధానము లగు దీని పద్యములు భావగర్భములై మృదువులై హృదయంగమములై యున్నవి. ప్రథమాంకమున లక్ష్మణుఁడు సీతను వనాంతరమున విడిచి, "శ్వశ్రస్య భ్రాతురాదేశా దాదాయ విజనే వనే। పరిత్యక్తాసి దేవి త్వం దోషమేకం క్షమస్వ మే." "జాతశ్రమాం కమలగంధకృతాధివాసైః కాలే త్వమప్యనుగృహాణ తరంగవాతైః। దేవీ య.........నాయ విగాహతే త్వాం భాగీరథి ప్రశమయ క్షణమంబువేగం। యే కేచిదత్ర మునయో నివసంత్యరణ్యే విజ్ఞాపయామి శిరసా ప్రణిపత్య తేభ్యః। స్త్రీత్యుజ్ఝితేత్యశరణేతి కులాంగనేతి దేవీ సదా భగవతీ త్యనుకంపనీయా." అని చెప్పుచు నయోధ్యకు మరలిపోవఁగా, వాల్మీకి సమిత్కుశార్థము వనసంచరణమున సీతఁ గాంచి నిజాశ్రమమునకుఁ గొంపోవుచు, "ఏతస్మిన్ కుశకంటకే లఘుతరం పాదౌ నిధత్స్వాగ్రతః। శాఖేయం వినతా నమస్వ శనకై ర్గర్తో మహాద్వావృతః। హస్తేనావృక తేన దక్షిణగతం స్థాణుం సమం సాంప్రతం। పుణ్యేస్మిన్ కమలాకరే చరణయోర్నిర్వర్త్యతాం క్షాళనం." అని సుకుమారి యగు సీతకుఁ గుమారికిం బోలెఁ బ్రమాదభీతి సూచించుచు నాశ్రమపదమునకుఁ దెచ్చి కుశలవులకుఁ బుంసవనాదికృత్యములు నడపెను. ద్వితీయాంకమున రాముఁడు వనాంతముల సంచరించుచు గోమతీతీరమున మదకలకలహంసగీతరమ్యోపకంఠము లగు ప్రదేశములు చూచి, "ముక్తాహారా మలయమరుత శ్చందనం చంద్రపాదాః। సీతాత్యాగాత్ప్రభృతి నితరాం తాపమేవావహంతి। అద్యాకస్మాద్రమయతి మనో గోమతీతీరవాయు ర్నూనం తస్యాం దిశి నివసతి ప్రోషితా సా వరాకీ." అనెను. వాల్మీకాశ్రమముఁ జూచి, "సురభికుసుమగంధై ర్వాసితాశాముఖానాం। ఫలభరనమితానాం పాదపానాం సహస్రైః। ర్విరచితపరిబోధ క్వాపలోపాంతరేఖో। రమయతి హృదయం మే హంత ద్వనాంతః." "అస్మిన్ కపోలమదపానసమాకులానాం విచ్ఛిన్నం న జాతు జనయంతి మధువ్రతానాం। సామధ్వనిశ్రవణదత్తమనోవధాన నిష్పందమందమదవారణకర్ణతాళాః." "ముక్త్వా వసంతి

హాస్యమైన పిదప యమభటుఁడు డాతూ ప్రాణముల వినిమయము చేసి పోవఁగా శాండిల్యుఁడు మరలఁ బరివ్రాజకుని నిజతత్త్వమున నున్నవానిఁగాఁ గని యెల్ల నేమి యని యడుగఁగాఁ బరివ్రాజకుఁడు "అస్తంగతో హి దినకృద్గగనాంతలంబీ మాహాముఖస్థ ఇవ తప్తసువర్ణ రాశిః । యస్య ప్రభాభిరనురంజితమేఘబృంద మాలక్ష్యతే దహన గర్భ మివాంతరిక్షం." అనునట్లు సంధ్య యయ్యె; కథ పెద్దది యథావకాశముగాఁ జెప్పెద నని నిష్క్రమించును. అక్కటా! ఇట్టి కవుల కావ్యములు భరతఖండాలంకారములు కాలపురుషుని యున్మత్తహస్తములకు విక్రీతకందుకము లయ్యెఁ గదా! ఈ కథా సారమును విశదీకరింపఁగా "అస్మిన్ నాట్యరసే నిసర్గగహనే యోగీంద్రశిష్యావుభౌ । ఆత్మానౌ పరజీవశబ్దకలితావన్యా తథైవాజ్ఞికా । మూలాధారసముద్గతా సుసుషిరా నాడీ సుషుమ్నాపరే । చేష్ట్యో చోభయపార్శ్వగే సుచిరే నాడ్యావిడాపింగళే." అని జీవాత్మపరమాత్మకుండలినీశక్తిరూపము లగు శిష్యపరివ్రాజక గణికల రంగస్థలముల నాడించి నిసర్గగహన మగు యోగమార్గమును బామరుల కన్నులకుఁ జూపఁగల కవులు కొందఱే జన్మించిరి.

## V మత్తవిలాసము

ఇదియు నేకాంక ప్రహసనమే. మతముల పేళ్లు పెట్టుకొని మతాచార్యుల బోధసార మెఱుంగక కులక్రమాగతపదాచారము నీటఁ గలిపి నూతనబోధలలోని దురాచారముల మాత్రమె యనుష్ఠింపఁజాలిన మహానుభావుల కంధప్రాయ మగు జ్ఞానచక్షువును దెఱపింప లేక చర్మచక్షువుల కైన నాడి చూపుట కనిరో యీ రూపకమున బౌద్ధకాపాలికోన్మత్తులు భిక్షాశనమున జీవించుచున్నను మద్యపానమత్తులై కుక్క గొని పోయిన భిక్షాపాత్రమునకుఁగా నొకరి నొకరు రాడికొనుచు నాచార్యపురుషుల సైతము హేళనము చేయుచుఁ బ్రొద్దుపుచ్చినట్లు కథాశరీరము కల్పించి కాంచీపురాధీశ్వరుఁడును బల్లవకులసంజాతుఁడు నగు మహేంద్రవిక్రమవర్మ దీని రచించెను. ఇతఁడు క్రీ. శ. ౭-వ శతాబ్దిలో నుండినట్లు తోఁచుచున్నది. ప్రబోధచంద్రోదయములో క్షపణకబుద్ధాగమసోమ సిద్ధాంతులఁ గూర్చుట కిది మూలము కాఁబోలు. ఇట్టిదే పూర్ణపురుషార్థచంద్రిక యను నాటకము మఱియొకటి గలదు. దాని జాతవేదోమహాకవి రచియించె. మత్తవిలాసమునఁ గపాలి త్రాగి యాడుచున్న దేవసోమ యను భార్యతో "తపస్సుచేఁ గామరూపము సిద్ధించు ననుట కాపాలికవ్రతతత్పర వగు నీయెడ నిక్కమయ్యెఁ గాబోలు!" నీకు "ఉద్భిన్నశ్రమవారిబిందువదనం సభ్రూలతావిభ్రమం । ఖేలం యాతి మకారణాని హసితాన్యవ్యక్తవర్ణా గిరః । రాగాక్రాంతమధీరతారమలసాపాంగం యుగం నేత్రయో । రంసోపాంత విలంబినశ్చ విగళన్మాలాగుణా మూర్ధజాః." అని వేషవిశేషమును వర్ణించెను. ఇట్లె మఱియొక ప్రాచీనకవి కుసుమపుర వైశికమున విలాసవిహారము సేయుచు మధుపానమోహాసద్యః ప్రత్యాగతస్మృతి యగు నొక విలాసవతిం జూచి విటుఁడు "హాసు, సుభగా భవ, త్వాంహ్యల్పావశేషమదారో సావశేషసంధ్యారాగా మివ ప్రతీచీం దృష్ట్వా ప్రప్రస్తశరాసనః కుసుమాయుధోఽపి తావద్వ్యాకులతాం గచ్ఛేత్. కిం పునరస్మ. శ్లో. ప్రణష్టా న వ్యక్తిర్భవతి వచసస్సైక మృదుతా । న రాగో నేత్రాబ్జే త్యజతి, న చ లజ్జా వ్యపగతా। స్మృతిః ప్రత్యాయాతా పరిహృషితమద్యాపి చ ముఖం । మదో దోషాన్ త్యక్త్వా త్వయి పరిణత స్తిష్ఠతి గుణైః." అని వర్ణించినట్లు తనభాణములోఁ జెప్పెను.

## VI కాదంబరీనాటకము

దీనిని గంగాధరకవి కుమారుఁడును విశ్వనాథకవి సోదరుఁడు నగు నరసింహకవి రచించెను. ఇతఁ డే కాలమువాఁడో తెలియదు కాని పెద్దకోమటివేమభూపాలుని పేర రచింపఁబడిన సాహిత్య చింతామణిలో దీనిలోని పద్యము లుదాహరింపఁబడియున్నందున నరసింహకవి క్రీ. శ. 1400 కంటెఁ బూర్వుఁ డనుట నిస్సంశయము. శ్రీనాథుని నూతనయౌవనకాలము వామనభట్టబాణుని కవితాసామ్రాజ్యము వేమభూపాలునియొద్దనే చెల్లియున్నది. మధురావిజయ మను కావ్యమున గ్రంథకర్త్రి యగు గంగాదేవి "చతుస్సప్తతికా వోక్తికీర్త్యక్తసైదుష్యసంపదే । అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః. స్తుమ స్తమపరం వ్యాసం గంగాధరమహాకవిం । నాటకచ్ఛద్మనా దృష్టాం యశ్చక్రే భారతీకథాం. చిరం స విజయీభూయా ద్విశ్వనాథః కవీశ్వరః । యస్య ప్రసాదాత్ సార్వజ్ఞం సమింధే మాదృశేష్వపి." అని వర్ణించిన మువ్వురిలో నగస్త్యుఁడు విశ్వనాథనరసింహులకు మేనమామ, గంగాధరుఁడు తండ్రియు నగుట కవివంశము స్తోత్రభాజన మగుచున్నది. సౌగంధికాహరణ మను ముద్రితనాటకమున విశ్వనాథకవి యగస్త్యకవి మేనల్లుఁ డని వర్ణింపఁబడుటంజేసియు గంగాదేవికి విశ్వనాథకవి గురు వగుటయు నరసింహకవియు వేమభూపాలుని యాస్థానమున నున్నవాఁడో లేక యించుక పూర్వుఁడో యెఱుఁగరాదు. దీనిలో మొదటి యెనిమి దంకములు మాత్రమే మాకు లభించినందున దాని పరిమితి చెప్పఁజాలము. 9-అంకములు గలదియే మో? నాటకమున 5 మొదలు 10 వఱకు నన్ని యంకము లైన నుండవచ్చును గదా. "శాకుంతలం తు సప్తాంక మష్టాంకం నళవిక్రమం । దేవీపరిణయం చాత్ర నవాంకం నాటకం స్మృతం." అని భావప్రకాశము. ఈ నాటకమునఁ గాదంబరీకథ యంతయు నంకములుగా విభజింపఁబడి మృదుమధుర మగు సులభశైలితో సంభాషణము నడపింపఁబడి యున్నది గాని భావములు బాణభట్టు కాదంబరిలోవలె మత్తెక్కించి క్షణమాత్రము బాహ్యప్రపంచమును మఱపింపఁజేయునవి కావు. అచ్ఛోదసరస్తీరమునఁ జంద్రాపీడుఁడు దిగి శివాయతనమున నున్న మహాశ్వేతను జూచి వీణ వాయించి నిలిపిన దాని తపశ్చర్య కాశ్చర్య పడి దానిచే సత్కారముఁ బొంది హృదయశంకాశంకు వగు దాని చర్యావిశేషమును బ్రశ్నము చేసి యది వృక్షములు సహితము నిలువు నీరుగా నేడ్వఁజాలినట్లు తన మదనభంగమును వర్ణించి చెప్పెడి సందర్భమునఁ జంద్రాపీడుఁడు "బాష్పైర్లోచనకుక్షిగర్భనిభృతై

ర్ముక్తాఫలాక్తైః క్షణం । స్థూలస్థూలనిబద్ధబిందుపతితైః పశ్చాన్మగ్నసంపిండితైః । సించంతీ స్వమురోజయుగ్మమభితః శ్వాసం సృజంతీ ముహుః । కృష్ణాత్మీయదిశాకంఠగద్గదరవా పర్యాకులం రోదితి." అని తలంచుకొనెను. పంచమాంకమునఁ జంద్రాపీడుని యెదుట నడపిన యంతర్నాటకమున సూత్రధారుఁడు నాట్యము నిట్లు ప్రశంసించును: "చాతుర్విధ్యమముష్య పంకజభువా దేవేభ్య ఉద్ధాపితం । కర్తుం భూతభవిష్యతోరలమిదం ప్రత్యక్షతామర్థయోః । అంగత్వం ప్రతిపాద్య చాస్య సకలాః కామం స్వదంతే కలాః । సామ్రాజ్యస్య ఫలం న కస్య హృదయోల్లాసాయ నాట్యామృతమ్."

## VII విజయవిక్రమము

ఇది యార్యసూర్యమహాకవిచే విరచింపఁబడిన యేకాంక వ్యాయోగము. ఆర్యసూర్యుఁడు కౌండిన్యగోత్రజుఁడు. ఆర్యసూరుఁ డను వాఁడొకఁ డుజ్జయినిలో రాజసభలోఁ గవితాబద్ధుఁ బరీక్షఁ యిచ్చి బ్రహ్మరథ మెక్కె ననేగాథవట్లు కావ్యమీమాంసలోఁ జెప్పఁబడియున్నది. అతఁడే యితఁ డైనయెడల విజయవిక్రమము క్రీ. శ. 4-5 శతాబ్దులలో రచియింపఁబడియుండవచ్చును. శైలి వలన నది 8-వ శతాబ్ది గ్రంథ మని కానవచ్చుచున్నది. దీనిలోఁ బదబంధము భావములును గథోచితముగా వీరరసప్రకర్షమును బొంది ప్రౌఢములుగా నున్నవి. ప్రస్తావనలో వసంతవర్ణనమున, "మోఽయం విమోచయతి జీర్ణమివాశుపర్ణం । రాగం ప్రవాళమివ నూతనమాతనోతి । వీరుత్స్విన ప్రతినవోత్కలికాకులాసు । యోగాశిత్స్వపి ప్రచరతి స్ఫుటమేవ చైత్రః." అనుభావము రమణీయమే. పాలికలనికి సైంధవపదార్థము వోపునప్పుడు కృష్ణుఁ డర్జునునితోఁ జెక్కు లుత్సాహకరముగాఁ జెప్పుచు, "రణప్రస్థానోద్యద్విపటుపటహనాదశ్రుతిభవ । స్మదాప్రాదుర్భూతప్రచురపులకాంకు తవ తను ।। అయం తే కృష్ణాయాః కుచకలశసంబాధసుభగః । పరీరంభో భూయో ద్విగుణపులకైర్దంతురయతి." భీష్ముని జూచి, "తీక్ష్ణైః కటాక్షవిశిఖైరపి సుందరీణాం । యస్యోర్ధ్వమాణ హృదయస్య దృఢవ్రతస్య । వీరశ్రియోపగతయా విమమాస్త్రయుక్త । కోఽయం పరమభూదన కీర్తితాస్య. విత్రర్థం త్యజతా సముద్రవలయక్షోణీగతప్రాభవం । భ్రాత్రర్థం చ సముజ్జితః ప్రణయినీసంభోగలీలారసం । పౌత్రార్థం జహత స్తథా ప్రియతమాః ప్రాణాః రణప్రాంగణే । లోకే తీర్ణ మహో న కిం గుణగణోత్తుంగస్య గాంగాయ తేః." ద్రోణుని గూర్చి, "క్షత్రశ్రియం ప్రకటయన్ విమమాస్త్రచిహ్నాం । బ్రాహ్మీం శ్రియం చ కలయన్ స్మితపేశలత్వాం । యః క్రూరసౌమ్య హృదయో మధునాప్యరస్తాదంతర్హ్యమాస్మృతయుతో ఽబ్ధిరివావభాతి." ఇత్యాదులు పెక్కు పద్యములు గలవు.

## VIII ఉభయాభిసారికా

ఇది వరరుచికృతభాణ మని తద్గ్రంథస్వామి లిఖించుకొనుట మాత్రమే కాని దీనిలోఁ గృతికర్తవిషయములు లెందును గానరావు. పేరులు లేని భాణములును నాటకములును పెక్కులు గలవు. భాణము సాధారణముగా నేకాంకపరిమితిగా నొక విటుఁడో ధూర్తుఁడో ప్రవేశించి వేశవాటమును వర్ణించుచు నాకాశభాషితమునఁ బ్రశ్నోత్తరములు జరపుచు శృంగారభావములు విస్తరింపఁజేయు రూపక విశేషము. ఇందును వైశికోచితము లగు భావములు పెక్కులు గలవు. దీనిలో నొకనిఁ గూర్చి యిరువురు వేశ్య లభిసరించి ప్రేమించుటయె కథ కాఁబోలు. వేశమునఁ దిరుగుచున్న విటుఁడు తన చూచిన గణికలతోఁ సల్లాపించి యాశీర్వాదములు సేయుచుఁ బోవు చున్న ఘట్టములలోఁ గొన్ని పద్యము లుదాహరించెదము: "కృష్ణాద్ధత్తోష్ఠబింబం విరతమృదుకథం హాసలీలావియుక్తం । జృంభోద్ఘాత్యసమిశ్రం పరిశిథిలభుజాలింగనం వీతరాగం । దుఃఖాద్రాత్రిక్షయాంత్యం కృతకరతికథా చేష్టితం భావహీనం । స్మృత్వా కాంతే కృష్ణా త్వం నిశి దివసకరస్యోదయం చింతయంతీ." అని వేశ్యావిరాగము సూచించును. ఇట్లె యొక మహాకవి భాణమున, వేశ్యాసంగమము నీరస మను స్వాంగార్థము బోధించుటకుఁగా దత్తకసూత్రమును బూర్వపక్షము చేయుచు "దుఃఖా శ్లేషయితుం కథాః ప్రతివచో లబ్ధుం చ దుఃఖం తతః । లబ్ధేఽపి ప్రచురే కథావ్యతికరే విస్రంభణం దుష్కరం । విస్రంభేఽపి తతః స్వభావసదృశీ దుఃఖా విధాతుం రతిః । సమ్యక్తాః ప్రస్తరేఽపి వేశయువతీ రక్తేతరా నైవ వా." అని గణికాకృతకరాగదౌర్బల్యమును వర్ణించెను. ఒక వార్ధవరివ్రాజక గూఢవైశికవ్యాపారుఁ జూచి విటుఁడు సంభాషింప నది మట్టువార్థబహిష్కృతసంభాషణము తన వైశేషికమతమున నిషిద్ధ మని యతని నిరోధింప, "ద్రవ్యం తే తనురాయతాక్షి దయితా రూపాదయస్తే గుణాః । సామాన్యం తవ యౌవనం, యుకజనః సంస్తౌతి కర్మాణి తే । త్వయ్యర్థే సమవాయమిచ్ఛతి జనో యస్మాద్విశేషః స్థితే । యోగ స్తే తరుణైర్మనోఽభిలషితై రోషితోఽప్యనిష్టాజ్జనాత్." అని తూలనాడె. మఱియొకచో వేశ్యాజనలోభముచే నర్థనుఁడై యేకశాటీమాత్రపరిచ్ఛదుఁడై దివ్యముని శాపహతునివలె నున్న యొకని యవస్థానిర్వేదమున కనుతాపము నొంది వైశికుఁడు "శాంతిం యాతి శనైర్మహౌషధిబలాద్దాహో విషాణాం విషం । శక్యో మోచయితుం మదోత్కటకటాద్దాత్మాగ కేంద్రాద్వనే । గ్రాహాస్యాపి ముఖాన్మహార్ణవజలే మోక్షః కదాచిద్భవేత్ । వేశస్త్రీబడబానలాననగతో నైవోత్థితో దృశ్యతే." అను నిర్వేదకరములగు వాక్యముల విషాదమును సూచించి గణిక లెల్లరు తమ తల్లుల ముందు త్రోచి విత్తార్జన మనురాగక్తి తనమున సంపాదింతు రను నర్థమును దెల్పుచు, "యథా నరేంద్రాః కుటిలస్వభావాః స్వయందుష్కృతం మంత్రిషు పాతయంతి । తథైవ వేశ్యాః శఠధూర్తభావాః స్వం దుష్కృతం మాతృషు పాతయంతి." అని రాజవేశ్యల గుణసామ్యము లక్షించెను. ఇందుఁ బాటలిపుత్రవైశికప్రశంస ప్రధానమయ్యె. వరరుచి సర్వజ్ఞుఁ డనియుఁ గంఠాభరణాదికావ్యములును సప్తాధ్యాయి యను నలంకారశాస్త్రమును రచించినట్లు తెలియుచున్నది కాని యవి మాకు లభించినవి కావు. సప్తాధ్యాయిలోఁ

గొన్ని పాదములకు వ్యాఖ్యానము తంజాపురి పుస్తకశాలలోఁ గలదు. ఈ సర్వజ్ఞుఁడు మాతంగకన్యను బరిణయమయినట్టును గేరళదేశమునఁ బదిరెండు జాతులలో సంతానమును వెలయించినట్టును ఐతిహ్యము గలదు. ఎంత నిశ్చయమో కాని భోజుఁ డొకానొక నాటకము లోని దని "ధూర్తైర్యచ్ఛ్వపచీక్ర్పలో వరరుచిః సర్వజ్ఞకల్పోఽపి సన్ । జీవన్నేవ పిశాచతాంచ గమితో భర్తృర్యదభ్యర్చ్యధీః।చండో గోయమితి ప్రభాకరగురుర్దేశాచ్చ నిర్వాసితో । యద్వృత్తాంతవిజృంభితేన మహతా తత్సర్వమఙ్గీకృతం." అని యుదాహరించుట చూడఁగా వరరుచి మాలలలోఁ గలిపి రని తేలుచున్నది. భర్తృవు బాణుని శిష్యుఁ డనియు నవంతిరాజమంత్రి యనియుఁ గొందఱు చెప్పుచున్నారు. (అవంతిః కావ్యమార్గస్య భర్తృకర్మ్మఖరిశేఖరః.)

## IX పాదతాడితకము

ఇది శ్యామిలకమహాకవిచే రచియింపఁబడిన భాణము. దీనిలోని పద్యములు వల్లభదేవుని సుభాషితావళిలోను క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చాసువృత్తతిలకములలో నుదాహరింపఁబడియున్నవి. ఇతని కవిత క్రీ. శ. 6-7 శతాబ్దులకంటెఁ బూర్వపు రీతి గల దని తోఁచుచున్నది. సుమారు క్రీ. శ. 960 లో నుండిన వ్యక్తివివేకకారుఁడు మహిమభట్టు తాను శ్యామలమహాకవి శిష్యుఁడ నని వ్రాసికొనియున్నాఁడు. ఎట్లయిన నితఁడు క్రీ. శ. 950 కంటెను బూర్వుఁ డనుట సిద్ధము. ఈ భాణము చాలఁ బెద్దది. దీనిలో విష్ణునాగుఁ డను రాజశాసనకరుఁడు విద్వాంసుఁడును బ్రాహ్మణుఁడునై యుండి సౌరాష్ట్రదేశమున సార్వభౌమనరేంద్రపురమున వేశ్య యింట రాత్రి చెల్లించి వేకువఁ బ్రణయకోపవిశేషముచేఁ గాఁబోలు దానిచేఁ బాదతాడితుఁడై వృషలీపాదఘాతమునకుఁ బ్రాయశ్చిత్తము వెదకుచు బ్రహ్మసభకు రాఁగా వారు సమస్తస్మృతులు తిరుగవైచి చూచి యెందును దానికిఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడలే దని చెప్ప నతఁడు శోకించి యగలితుఁడై మొఱ్ఱో యనుచుండ నా సభలో నొకఁ డీ దోషము శృంగారరసానుభవమున వడచెఁ గావున దీని ప్రాయశ్చిత్తవిధానము విటసభలోఁ గాని తెల్లము గా దనియె. అంత నతఁ డంగీకరింప విటసభలో నపరాహ్ణమున విటు లొక్కొకరు ప్రాయశ్చిత్తవిశేషముల యథోచితముగా వివరించి యతని సంతుష్టుం జేసి పంపుటయే దీనిలోని కథ. విటులఁ బిలువఁ బోవువాఁడే దీనిలోని ముఖ్యపాత్రము. విటసభలో నానాదేశపు విటులు గూడి తమతమ చిత్రప్రాయశ్చిత్తవిధానము దెలుపుట సరసముగా నుండకతక్కదు. దీనిలోని కొన్ని పద్యము లుదాహరించెదము: "ఇద మిహాపరం మహాభూదేవం భవత్విదమన్యథా । కృతమిద మయం గ్రంథే నార్థో మహాననుపాదితః । ఇతి మనసి యః కావ్యారంభే కవేర్భవతి శ్రమః । స నయనజలో శోమోద్భేదః సతాం తమపోహతి." "లలాటేవిన్యస్య క్షతజసదృశం చందనరసం । మృణాలైః క్రీడంతీ కువలయపలాశైః సకమలైః । సలీలం భ్రూక్షేపై రనుగతసుఖప్రాప్తికకథా । విరక్తా రక్తా వా శిరసి రుజమాఖ్యాతి గణికా." ఈ మహాకవి పద్యములే లక్షణగ్రంథములలోనుండి యుదాహరించెదము: "సోత్కంఠైరివ గచ్ఛతీతి కమలైర్మీలద్భిరాలోకితః । ప్రచ్ఛాయైరధిరుహ్య వేశ్మశిఖరాణ్యుత్సార్యమాణాతపః । తైః స్పృష్ట్వా చిరమున్ముఖీషు కిరణైరుద్యానశాఖాస్వసౌ । యాత్యస్తం వలభీకపోతనయనై రాతామ్రతారో రవిః. కామస్తపస్వీషు జయత్యధికారకామో । విశ్వస్య విత్తవిభురింద్రియవాజ్యధీశః । భూతాని బిభ్రతి మహాంత్యపి యస్య శిష్టిం । వ్యావృత్తమౌళిమణిరశ్మిభిరుత్తమాంగైః ఉత్క్షిప్తాలకమీతక్షణాంతగళితం కోపాంచితాంతర్భ్రువా । దష్టౌష్ఠోష్ఠమధీరదంతకిరణం ప్రోత్కంపయంత్యా ముఖం । శింజన్నూపురయా విక్రమ్య విగళద్రక్తాంశుకం పాణినా । మూర్ధన్యస్య సనూపుర స్సమదయా పాదోఽర్పితః కాంతయా."

## X పద్మప్రాభృతకము

ఇది శూద్రకకవి విరచిత మగు నేకాంకభాణము. ద్వ్యంక త్ర్యంకభాణముల మాతృగుప్తాచార్యకోహళులు వివరించియున్నారు. ఇం దుజ్జయినీపురవేశవాటి వర్ణింపఁబడియె. దీని కవిత్వము రమణీయమై హృదయంగమముగా నున్నది. శూద్రకుఁడు మహాకవి యనుట మృచ్ఛకటికముచేతనె కాక వామనాద్యాలంకారికు లెల్లరు విస్తారముగా వీని పద్యము లుదాహరించుటచేఁ దెల్లము. ఇందు విటుఁడు తన స్నేహితుని విరహావస్థ నిట్లు వర్ణించుచున్నాఁడు: "ఉన్నిద్రాధికతాంతతామ్రనయనః ప్రత్యూషచంద్రాననో । ధ్యానన్యాసతనుర్విజృంభణపరః సంతప్తసర్వేంద్రియః । రమ్యైశ్చంద్రవసంతమాల్యరచనాగాంధర్వగంధాదిభిః । రైరేవ ప్రముఖాగతైస్స్మరమతే తైరేవ సంతప్యతే." కందుకక్రీడఁ జేయు నొక గణికం జూచి "ప్రేంఖోలత్కుండలాయా బలవనిభృతం కందుకోన్మాదితాయా । శ్చంచద్బాహుద్వయాయాః ప్రవికచవిస్రస్తోద్గీర్ణపుష్పాలకాయా । అవర్తోద్భ్రాంతవేశప్రణయవిలసితక్షుబ్ధకాంచీగుణాయా। మధ్యస్యావల్గమానస్తనభరనమితస్యాస్య తే క్షేమమస్తు." అనియు, గ్రంథాంతమునఁ దన మిత్రుని ప్రియం గనుఁగొని దాని విరహావస్థ నవలోకించి తన మిత్రుని దైన్యస్థితికిఁగా నొకానొక యుపహారముం గోరి "శశిమల్లీలాభిదష్టం స్తనతటమృదితం పత్రలేఖానువిద్ధం। ఖిన్నం నిశ్వాసవాతైర్మలయతరురసక్లిష్టకింజల్కవర్ణం। ప్రాతర్నిర్మాల్యభూతం సురతసముదయప్రాభృతం ప్రేమయాస్తె। పద్మం పద్మాననా తే కరతలయుగళభ్రామణక్లిష్టనాళం." అని దాని పూర్వరాత్రవిరహక్లిష్ట మగు పద్మమును గ్రహించి మిత్రుని కర్పించి ప్రాణముల నిలుపును.

## మఱికొన్ని భాణములు

వీని నామములును గర్తల పేళ్లును గానరానందున నించుమించుగాఁ బూర్ణము లగు పెక్కు భాణములలో నొక్కదానిఁ గూర్చి మాత్ర మించుక తెలిపెదము. ఇందుఁ గుసుమపురవేశమే వర్ణింపఁబడినది. ఒక విటుఁడు వీథులలోఁ దిరిగి వేశము సొచ్చి యొక

యుండెను. ఎల్ హైలమునుండి బీరుషెబాకును, బీటుహోనుకును రైలు మార్గములను శత్రువు నిర్మించియుండెను. అపారమైన యుద్ధసామగ్రిని శత్రువు తీసికొని వచ్చియుండెను. వీనిని బట్టి శత్రువు గాజా నెందలుకొని, బీర్షాబావఱకునుగల తన సేనాముఖమును రక్షింపదలచుకొనెనని వ్యక్తమగుచున్నది. అట్టిసందర్భములం దాంగ్లులు అక్టోబరు 31వ తేదిని ముట్టడిని ప్రారంభించి ఉత్తరమునుండియు దక్షిణమునుండియు బీర్షాబాను వశపరచుకొని పశ్చిమప్రాంతమునందలి షీరియా, హీరారా వైపునకు సైనికులు వెళ్లిన కొలదిని గాజాముఖము రక్షణయోగ్యము గాక దానిని శత్రువులు త్యజింపవలసివచ్చెను. గాజాముఖము ఆంగ్లులకు వశమైన వెనుకను శత్రుసేనలు చెల్లాచెదరుగ ఒక పార్శ్వము సముద్రప్రాంతమునుండియు మరియొక పార్శ్వము తూర్పు ముఖముగను పలాయనమైనవి. యుద్ధ మారంభమైన 15 దినములకు ఆంగ్లులు తమ తూర్పుభాగమునందు 20 మైళ్లదూరమును, ఎడమ భాగమునందు 40 మైళ్ల దూరమును ముందునకు వెళ్లగలిగిరి. శత్రుసేనలు చెల్లాచెదరై పోయిన పిమ్మట జాఫా, లుడు, రామ్లే పట్టణములను ఆంగ్లులు సులభముగ పట్టుకొనిరి. తూర్పుప్రాంతమునకు పలాయనమైన శత్రుసేనలు జరూసలేము వైపునందు గల కొండలను శరణ్యము చేసికొనియుండెను. ఉత్తరాభిముఖముగ పారిపోయిన సేనలకును జరూసలేము వైపునకు చేరిన సేనలకును సంయోగము కలిగి శత్రువు నిలద్రొక్కుకొనుటకు జరూసలేమును త్యజించి టుల్-కెరామ్-నాబులసుముఖమును చేరినప్పుడు వీలు కలుగును. సముద్రప్రాంతమునుండి ఆంగ్లులు యుద్ధసామగ్రిని ముఖ్యగువానిని సేనాముఖమునకు చేర్చవలసియుండెను. రైలుమార్గములను త్వరితముగ వేయవలసియుండెను. క్రొత్తప్రస్థానమునకు తగినసన్నాహములు జరుగువఱకును యుద్ధమునందు కొంతవిలంబ మేర్పడు టవసరమైయుండెను. జాఫా జరుసలేములకు రామ్లేమీదుగ నొకటేమార్గము కలదు. రామ్లేనుండి బయలుదేఱిన సేనలకు అన్నాబేదాటిన వెనుక బండ్లు నడచుటకు అవాంతరములు కలిగెను. అష్లే ముందునకు దారిచేసికొని ఒక దళము కర్యటువైపునకును రెండవదళము ఉత్తరమునుండి బీరా వైపునకును వచ్చినవి. అప్పటికి వల్లను జరూసలేమమార్గమును ఆంగ్లులు సమీపించి సైనికులు వచ్చి పడుచుండిరి. జరుసలేము చుట్టును శత్రువులు నిర్మించిన రక్షణసాధనము లొకటి తరువాత మరియొకటి విజేతలకు స్వాధీనమగుచుండెను. అక్కడి శత్రుసేనలు తమస్థానములను కాపాడుకొనుటకు వీలులేక జరూసలేమును త్యజించి మరలిపోయినవి. డిశెంబరు 11వ తేదిని ఆంగ్లులాపట్టణమునందు ప్రవేశించిరి. అక్టోబరునుండియు జరిగిన యుద్ధమునందు 12 వేల మంది తురుష్కసైనికులు విజేతలకు వశమైరి; బోలెడు మందుసామగ్రియు వశమైయుండెను. జార్డనునదీప్రాంతమును దాటిపోయిన ఆంగ్లసైనికులకు కొంతనిరోధము కలిగి ఇస్-సాల్టుపట్టణమును త్యజించిరి. అందువలనను జార్డను నదీప్రాంతమునందలి సేనలలో చాలభాగమును ఆంగ్లులు వెనుకకు మరలించియున్నను నదీ తూర్పుభాగము వారి స్వాధీనములోనే కలదు. జార్డను తూర్పుభాగమునందు తీవ్రయుద్ధము జరుగుచుండెను. ఆంగ్లులు జార్డనునది తూర్పుభాగమునకు రెండుపర్యాయములు వెళ్లిరి. రెండుసారులును వెనుకకు మరలవలసివచ్చినది. అంతకంటెను ఆ ప్రాంతమునందలి యుద్ధసమాచారము తెలియుటలేదు.

## మెసపొటేమియా రంగము

మెసపొటేమియా రంగమునందు బాగ్దాదుపట్టణము ఆంగ్లులకు వశమైన వెనుకను ఇఫ్రటీసు నదీప్రాంతమునందు వారికి విజయము కలిగినది. ఇఫ్రటీసునదీ దిగువభాగమునుండి తురుష్కులు పలాయితులైరి. బాగ్దాదుపట్టణమున కుత్తరభాగమునందలి ఫెలూజాపట్టణమునుండి ఆంగ్లసేనలు ముందునకుపోయి మహాయెడు పట్టణమును ముట్టడించి రామడైని పట్టుకొనినవి. అక్కడ అహమదుబే నాయకత్వము క్రిందను యుద్ధము చేయుచుండిన తురుష్కసేన యంతయు ఆంగ్లులకు వశమైనది. రామడై ఫెలూజాపట్టణమునకు పశ్చిమముగ 30, 40 మైళ్ల దూరమునందు కలదు. తరువాతను డెల్టీవా, కిజిలు, రోబటు ప్రాంతములందు కూడ యుద్ధము జరిగి డెల్హావట్టణమును ఆంగ్లులు వశపఱచుకొనిరి. నహారిను, డెల్హానదుల మధ్యను గల ప్రదేశమునందు ఆంగ్లుల పురోగమనము నాపుటకు తురుష్కులు చేసిన ప్రయత్నములు కార్యకారి గాలేదు. హేమరాను పర్వతప్రాంతమునుండి తురుష్కసేనలను ఆంగ్లులు తఱిమివేసియుండిరి. అక్కడనుండి ఆంగ్లులకు పురోగమనము కనిగి కిఫ్రీ, ఎయినుపారిసు, చామముక్ప్రి పట్టణములు వారికే స్వాధీనమైనవి.

## తదితరరంగములు

తదితరరంగములందు బాల్కనునందు ప్రచలనము కలిగియుండలేదు. రుమేనియా రుష్యారంగములకు సన్నిహితసంబంధ ముండుటయు, రుష్యనులు ప్రత్యేకసంధి చేసికొనుటవలన రుమేనియారంగము దుర్బల మగుటయు నందువలన రుమేనియనులు ప్రత్యేకసంధికి ఒప్పుకొని యుద్ధమును విరమింపవలసి వచ్చినది.

## 1918వ ప్రస్థానము

### జర్మనుల యువస్కందనము

1918-వ సంవత్సరమునందు జర్మనులు విజయమును గాంచుటకు భగీరథప్రయత్నములను చేసితీరుదు రనియు ఆ కాలమునందు మిత్రమండలి కాలవిలంబనముచేసి రక్షణతంత్రము నవలంబించి శత్రుబల ముడిగిన వెనుక వారి నోడించు ననియు యుద్ధచారిత్రమునకు ప్రారంభమునందు వ్రాసియుంటిమి. శత్రు విప్పుడు రణరంగమునందు తన సర్వస్వము నొడ్డుచున్నాడు. మార్చి 21-వ తేది గురువారమునాడు జర్మనులు పశ్చిమరంగమునందలి ఆంగ్లపరాసుల కూడలిస్థానమునందు దారుణసంగ్రామము నారంభించిరి. ఆయుద్ధమువలన జర్మనులు ఆంగ్లపరాసు సేనలను వేఱుపఱచి తమ కనుకూలమైన ట్లొకరివెనుక నొకరిని విడివిడిగ సంహరించుటకు సంకల్పించిరి. యుద్ధారంభమునుండియు జర్మనుల కాంగ్లసేనలే గర్భశత్రువుగనుండి వారికి విజయమును దూరము చేయుచున్నవి. పరాసు సేనలనుండి ఆంగ్లసేనను వేఱుపఱచి, వానిని సంహరించుటయే జర్మనుసేనానుల యుద్దేశ మని కొందఱు చెప్పుదురు. ఎమీన్సు పట్టణమును వశపఱచుకొని అయిను నదీప్రాంతమునుండి పారిసుపట్టణమును జర్మనులు వశపఱచుకొన దలచియుందు రని కొందఱు చెప్పుదురు. జర్మనుల ప్రథమసంకల్ప మీ రెంటిలో నేదియైనను తరువాత జర్మనులు ఆర్మెంటీసుయొద్ద కూడ ముట్టడించుటచే వారికి రెండు సంకల్పములు కూడ కలిగె ననియును, ఆరంభమునందు పరాసు సేనలు ఆంగ్లులకు సాహాయ్యము చేయుటకు వీలు లేకుండ వేఱుపఱచి, తరువాత ఆంగ్లముఖమును భేదించి వైప్రెసు ముఖమునందలి సేనలను సముద్రము వైపునకు తఱిమివేసి సోముముఖమునందలి సేనలను సంహరించి జర్మనులు పారిసుపట్టణముమీదకు విజయయాత్ర కుపక్రమింప దలచి యుందురని యూహించుటకు వీలు కలుగుచున్నది. ఎమీన్సు ప్రస్థానమునకును, ఆర్మెంట్రీసు ప్రస్థానమునకును ఏకకాలమునందే

జర్మనులు సన్నాహములు చేసియుండవచ్చును. వారి సైనికపంక్తి వెనుకను దిట్టమైన గమనాగమనసాధనము లుండుటచే వారట్లు చేయుటకు వీలు కలదా లేదా యను సందియమున కాధారము లేదు. జర్మనుల ప్రకృతపు ప్రస్థానతంత్రము నాలోచించినకొలదిని వారు పడమటిరంగమునందు విజయము గాంచుట కెన్నియెత్తులనైన నెత్తి మిత్రమండలి సేనలను కందకములనుండి కదలించి బహిఃప్రదేశమునందు వ్యూహపరంపరలను పన్ని తమ సైన్యపు టాధిక్యమును గనబఱచి యేలాగు నైనను యుద్ధమునందు జయాపజయములను నిర్ణయించుటకు కృతనిశ్చయులై యున్నారని తోపకమానదు. తత్ఫలప్రాప్తికై వారు ఆరంభమునందు ఆంగ్లపరాసుసేనల సంయోగమును భేదించి తరువాతను ఆంగ్లముఖమును రెండు భాగములుగ చేసి ఒకటి తరువాత నొకదాని నోడించి చివరను పరాసుల పని పట్టినయెడల సులభముగ సంధిచేసికొనుట వీలు కలుగు నని దలచియుండురు. కాని జర్మనుల ప్రయత్నము లింతవఱకును కార్యకారి కాలేదు; ముం దట్లు జరుగునని యు తలచుటకు వీలులేదు. జర్మనుల రణతంత్రమువలన కలుగు విషమస్థితిని మిత్రమండలి సేనాధ్యక్షులు గ్రహించి దానికి ప్రతిక్రియచేయక పోలేదు. ఇంతవఱకును యుద్ధస్వరూపమునందు నూతనదశ యేర్పడి యుండలేదు; విశాలముఖమునందు శత్రుసేనలను కందకములనుండి కదలించి వానిని భేదించి వ్యూహజాలమునందు వానిని చిక్కించి యోడించిన గాని జర్మనులకు యుద్ధమునందు విజయము కలుగనేరదు; యుద్ధ మింకను సూచీముఖప్రస్థానదశయందే కలదు; జర్మను లింకను ఆ స్థానమున కీ స్థానమునకును పెనగులాడుచు నేయున్నారు. కాని జర్మనులు తమ సంకల్పమును మానుకొనిరని తలచుటకు వీలు లేదు. వారి ప్రస్థానమునకు ప్రస్తుత మవాంతరము కలిగినదని మనము నమ్మవలయును. జర్మనులకు సేన లుండినంతవఱకును వారు తమ సంకల్పమును మానరు. జర్మనుల సంకల్పమున కవాంతర మెట్లు కలిగినదియో యుద్ధప్రస్థానమును దిలకించినప్పుడు వ్యక్తము కాగలదు. వారు మార్చి 21 వ తేదిని 50 మైళ్ల ముఖమునందు స్కార్పు సోమ్మ నదులమధ్యను కెంబ్రెయి పశ్చిమమునందు అవస్కందనమును ప్రారంభించి మిత్రమండలి సేనాముఖమును భేదించి మాంటిడిడరు పట్టణమువఱకును వచ్చిరి. అంతటితో వారి పురోగమన మాగిపోయినది. మాంటిడిడరునకును పరాసుల రాజధానీ నగరమునకును 55 మైళ్లదూరము కలదు. అయినను లోయనుండి పరాసుల రాజధానీనగరమునకు సులభమైనమార్గము కల దని జర్మనుల విశ్వాసము. లా ఫెరీపట్టణము మొదలు క్రోయిసెలు పట్టణమువఱకును జర్మనులు అగ్నివర్షమును రెండుగంటలు కురిపించి పదాతిసేనను ముందునకు పంపిరి. జర్మనుపదాతిసేన శుక్రవారము సెయింటుక్వెంటెనునకు పడమటను ఆంగ్లసైనికుల రక్షణస్థానములను భేదించుటవలన ఆంగ్లులు వెనుకకు మరలవలసివచ్చినది. శనివారము శత్రువులు పెరోనుపట్టణమునకు తూర్పుభాగమునందు టోర్టెలునదిని దాటి ముందునకు వచ్చి తరువాతను సోమునదిని కూడ దాటియుండిరి. సోమవారమునాడు వారు ఆల్బర్టుబాపూము మార్గమున కిరుపార్శ్వములందును గల మార్టినుపుచ్, కార్నలెటు గ్రామములను వశపఱచుకొనుటవలన మిత్రమండలి సేనలు ఆల్బర్టును త్యజించి దానివెనుకను గల ప్రదేశముల నాక్రమించుకొనవలసివచ్చెను. పరాసుముఖమునందు శత్రువు రోయి-బ్రెటూయి మార్గమునం దవస్కందమును ప్రారంభించి పరాసులను 8 మైళ్ల దూరము వెనుకకు తఱిమి యుండెను. అందువలనను జర్మనులు మాంటిడిడరు పట్టణమును పట్టుకొనగలిగిరి. జర్మనుల కా యుద్ధమునందు ఆంగ్లముఖమునందు మేసీర్సు మొదలు మోరులువఱకును వ్యాప్తమైన ప్రాంతమును మాంటిడిడరువఱకును పరాసు ముఖమునందలి ప్రాంతమును స్వాధీనమైనది. కాని అర్రాసునొద్దను, దానికి దక్షిణభాగమునందును శత్రువున కెంతమాత్రమును పురోగమనము కలిగియుండలేదు. అర్రాసు ముఖమునందు జర్మనులకు పురోగమనము కలిగియుండక పోవుటచే ఉత్తరమునందలి (వైప్రెసుముఖము) ఆంగ్లసేనను మరలించుటకు వీలు కలుగలేదు. అర్రాసును దొమ్మిచేసి పట్టుకొనుటకు జర్మనులకు సాధ్యమై యుండలేదు. కావున అర్రాసునకు ఉత్తరమునందు ముట్టడించి ముందునకు రాగలిగినయెడల యుద్ధముచేయ నక్కఱలేకుండ స్వల్పనష్టముతో నక్కడి ఆంగ్లసేనాపంక్తిని మరలించుటకు వీలు కలుగుననుసుద్దేశముతో జర్మనులు లెన్సుపట్టణమున కుత్తరమునందు లాబాసీ కాలువ మొదలు వైప్రెసుపట్టణమునకు దక్షిణమునందు గల హాల్బెకుపట్టణమువఱకును ఏప్రిలునం దవస్కందనము ప్రారంభించి ఆర్మెంటీరుసు ప్రాంతమును సంరక్షించుచుండిన పోర్చుగీసు సేనను ప్రబలసైన్యముతో లొంగదీసి దాని కిరుపార్శ్వములందును గల ఆంగ్లసైనికపంక్తి వెనుకకు మరలునట్లు చేసిరి. అక్కడ శత్రువులు మెర్విలువఱకును ముందునకు వెళ్లిరి. మెర్విలుపట్టణమునుండి జర్మను సేనాభుజము ఉత్తరమునందు మెస్సీన్సువఱకును, దక్షిణభాగమునందు గ్విన్షివఱకును వ్యాప్తమైయున్నది. తరువాత జర్మనులకు బైలూలు, కెమ్మెలు పట్టణములు స్వాధీనమైనవి. గ్విన్షికి ఉత్తరమునందు బెథూనుపట్టణము కలదు. యుద్ధ మాపట్టణమునకు వ్యాపించి శత్రువునకు దక్షిణమునందు పురోగమనము కలిగినయెడల లెన్సు అర్రాసుముఖమునందలి సేనాపంక్తి వెనుకకు మరలవలసివచ్చునని యుద్ధపటమును దిలకించువారలకు గోచరము కాగలదు. కావున బెథూనుపట్టణపు రక్షణము మిత్రమండలి సేనల కత్యవసరము. కాని ప్రస్తుతమునం దాప్రాంతమునందు యుద్ధము జరుగుటలేదు. అంతటితో పడమటిరంగమునందలి మార్చి ఏప్రిలు యుద్ధప్రస్థానమునకు విలంబము కలిగినది. ముందు జర్మను లుపక్రమించు ప్రస్థానస్వరూపమును ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేకున్నను మార్చి ఏప్రిలులందు జరిగిన యుద్ధస్వభావమునుబట్టి ముందు జరుగు యుద్ధస్వరూపమును కొంతవఱకును గ్రహింపవచ్చును. వారు మాంటిడిడరు ప్రాంతమునందును, మెర్విలు ప్రాంతమునందును ముందేక కాలమునందు అవస్కందనమును ప్రారంభించి తమ కప్పుడు కలుగు లాభాలాభములనుబట్టి యేదో యొకవైపునందు విజృంభించుట కాలోచింపవచ్చును. ఇంతకంటె ప్రస్తుతదశయందు జర్మను ప్రస్థానతంత్రమును గ్రహించుటకు వీలు లేదు.

## మిత్రమండలి రణతంత్రము

శత్రుభంజనమునకు 20, 80 లక్షల నూతనసేన కావలసియున్నది. ఆ భారమును అమెరికావారు వహించుచున్నారు. అమెరికా సేనలు శత్రువును దాకువరకును జర్మనులకు విజయము కలుగకుండ మిత్రమండలివారు ప్రతిఘటించెదరు. అమెరికా సేన లిదివఱకే కొంతవఱకును రణరంగమును ప్రవేశించినవి; తక్కినసేనలు త్వరితముగ ప్రవేశింపగలవు. కాలవిలంబనముకొఱకు పోరాడుచున్న మిత్రమండలి యుద్ధాశయమునుబట్టి కొంత ప్రదేశమును త్యజింపవలసి వచ్చినను సేనాముఖము చెక్కుచెదరకుండ నుండువఱకును భయపడ నవసరముండదు. మాంటిడిడరు ప్రాంతమునందు ఆంగ్లపరాసు సేనలకు క్షణకాలము వియోగము కలిగినప్పుడు ఆంగ్ల పరాసు సేనాధ్యక్షు లవలంబించియుండిన యుక్తమార్గమువలన తిరిగి వారి సేనాముఖము కమ్ముకొని శత్రువు ఎత్తు భంగమై పోయినట్లే ముందును అట్టి యుక్తమార్గమే ప్రబలి మిత్రమండలికి విజయదశ యేర్పడగలదు.

# చిత్రపటముల వివరణము

భారతమహిళల రాయబారము:— ఈ స్త్రీలలో మహారాష్ట్రులు, కర్ణాటకులు, పారశీకులు, వంగీయులు, యూరోపియనులు కలరు. వీరు భారతస్త్రీలపక్షమున కడచిన డిసెంబరు నెలలో మాంటేగ్యూగారికి మదరాసులో నొక నివేదనము సమర్పించిరి.

గంటి లక్ష్మీనరసింహము గారి సతీమణి:—ఈమె వంగదేశమునకు చెందిన నారీమణి. ఎఫ్. ఏ. పరీక్షలో కృతార్థురాలయినది. గానవిద్యయందు ప్రావీణ్యము కలదు. విజయనగరము ఎస్టేటులో చీఫ్ ఇంజనీయరు గానున్న శ్రీ లక్ష్మీనరసింహము బి. ఎ., బి. సి. ఇ. గారిని చాల సంవత్సరముల క్రిందట పెండ్లియాడినది.

జీవరత్నమ్మగారు, బి. ఏ. :— ఈమె మదరాసు క్రైస్తవకళాశాలలో చాల సంవత్సరములనుండి ఉపాధ్యాయుడుగా నుండిన ఓ. కందస్వామి శెట్టిగారి కొమార్తె. 1917 లో బి. ఏ. పరీక్షయందు కృతార్థురాలయినది. వీరి కాలములో ఈ పరీక్షయందు కృతార్థురాలగుట కీమెయే మొదటిది. దక్షిణ ఇండియా ద్రావిడ సంఘము వారామెకు బహుమానమొసంగి సత్కరించి యుండిరి.

వేంకటగిరి రాజాగారు:—ఆంధ్రదేశమందు విఖ్యాతి గాంచిన సంస్థానాధిపతులు. మహాదాత. కడచిన డిసెంబరులో మదరాసులో జరిగిన బ్రాహ్మణేతరసభ కగ్రాసనాధిపత్యమును వహించిరి. సైన్యమునందు రాజాగారు గౌరవ లెఫ్టినెంటుగా చేర్చుకొనబడిరి.

తేలప్రోలు రాజాగారు:—చెన్నపట్టణములో బ్రాహ్మణేతరోద్యమమును తమకున్న గొప్ప పలుకుబడిచేతను ధనముచేతను నడపుచున్న నాయకులలో శ్రేష్ఠులు. బ్రాహ్మణేతర మహాసభల కగ్రాసనాధిపత్యము వహించుచుందురు. నానావిధములగు ఆటలలో యూరోపియనులను మెప్పించుచుందురు. ఈయన సైన్యములో లెఫ్టినెంటుగా చేర్చుకొనబడిరి.

పుదుక్కోటదొరై రాజాగారు:— వీరు దక్షిణాదిని బ్రాహ్మణేతరోద్యమమునకు ముఖ్యనాయకులు.

పా. రామారాయణం గారు:— వీరి ఆంధ్రభాషాపాండిత్యము లెస్స. ఎం. ఏ. పరీక్షయందు కృతార్థులయిరి. సామ్రాజ్యశాసనసభలో సభ్యులుగాను విశాఖపట్టణములో జరిగిన ఆంధ్రమహాజనసభ కగ్రాసనాధిపతులుగాను నుండిరి. ఇప్పుడు బ్రాహ్మణేతరోద్యమ వ్యాపనమునకయి యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు. పానుగల్లు జమీందారులు.

చల్లపల్లి కుమారరాజా గారు:—కృష్ణాజిల్లా చల్లపల్లి రాజాగారి పుత్రులు. బి. ఏ. పరీక్షలో కృతార్థులయిరి. చెన్నపురియందు నివాసమేర్పఱచుకొని విశేషముగ బ్రాహ్మణేతరోద్యమమునకు కృషి చేయుచుందురు.

ఆర్కాటునవాబు గారు:—వీరు సుప్రసిద్ధ ఆర్కాటు వంశమునకు చెందినవారు. మదరాసు రాజధానిలో మహమ్మదీయ నాయకులలో నగ్రగణ్యులు. యావన మహమ్మదీయులపక్షమునకు గాని ఆల్ ఇండియా మాస్లింలీగునకు గాని చెందక వారికి వ్యతిరేకముగా పనిచేయు మహమ్మదీయసమాజమును మదరాసులో స్థాపించి ప్రభుత్వమువారికి తోడయి పనిచేయుచుందురు.

డాక్టరు నాయరు గారు:—చెన్నపురి రాజధానియందు సుప్రసిద్ధతనుపొందిన బ్రాహ్మణేతర నాయకాగ్రగణ్యులు. జస్టిసు పత్రికాసంపాదకులు. వక్త. ఎం. డి. పరీక్షలో కృతార్థత చెందిన వైద్యులు.

పి. త్యాగరాయ శెట్టి గారు:—బ్రాహ్మణేతరోద్యమమునకు మూలవిరాటువంటి వారు. జస్టిసు ఆంధ్రప్రకాశిక ద్రావిడన్ దైనికపత్రికలను స్థాపించి బ్రాహ్మణేతరోద్యమమునకు విశేషముగా కృషిచేయుచున్నారు. గొప్పవర్తకులు. వాణిజ్యవ్యాపారములయందు వారికున్న యనుభవము అపారము. చెన్నపురి శాసనసభ్యులుగా నుండిరి. అనేకసంవత్సరములనుండియు మునిసిపల్ కమీషనరుగా నున్నారు. దక్షిణఇండియా వ్యాపారసంఘమున కధ్యక్షులు.

జనరలు మక్రై:— లండనులో యుద్ధనిర్వాహక సభ కధ్యక్షుడుగా నుండెను. గొప్ప సేనాని. ఇప్పుడు బ్రిటిషుద్వీపములను జర్మనుదాడినుండి తప్పించుటకు సిద్ధముచేయుచున్న సైన్యములకు సేనాని.

అంబ్యూలెన్సుబండి:—ఇందు దెబ్బలుతిన్న సైనికులకు కావలసిన మందులు శస్త్రపుపనిముట్లు ఇతరపదార్థములు ఉండును.

సామ్రాజ్యయుద్ధసభ :— లాయిడుజార్జి బ్రిటీషు సామ్రాజ్యమునకు ముఖ్య మంత్రి; సర్ రాబర్టుబోర్డన్ కానడాదేశమునకు ముఖ్యమంత్రి; హ్యూజెస్ ఆస్ట్రేలియాకు ప్రధాన మంత్రి; హేజన్ కనడా మంత్రులలో నొక్కడు; బికనీరు మహారాజు— వీరందరును 1917 లో జరిగిన సామ్రాజ్యయుద్ధసభలో సభ్యులుగా నుండి బ్రిటిషు సామ్రాజ్యమునకు చెందిన అనేకవ్యవహారములను పరిష్కరించి తీర్మానములను చేసిరి.

విజయనగరము యువరాజు గారి కుటుంబచ్ఛాయాపటము:— పెండ్లికుమారుని పేరు అలక్ నారాయణగజపతి గారు. కుడిపైపున తమ్ముడు. ఎడమపైపున బావమరది. క్రింద కూర్చున్నవారిరువురు భావమరదులు. పెండ్లికుమారుని వయస్సు 16

సంవత్సరములు. అత్తవారి యూరు వేంగయి, సీమ్లాకు 12 మైళ్ల దూరమునఁ గలదు. అజమీరు రాజకుమారకళాశాలలో విద్య నభ్యసించుచున్నారు. ఉదారస్వభావులు. తెలివి గలవారు. ఈయనకు ఒక తమ్ముఁడును ఒక చెల్లెలును గలరు.

డాక్టరు యు. రామారావు గారు:—చెన్నపురిలో వైద్యులు. ఈయుద్ధములో ప్రారంభ సహాయము చేయుటకయి చాల మంది యువజనులను అంబ్యులెన్సుకోరుగా తయారుచేసి పంపుచున్నారు. గవర్నమెంటువా రందుకని రావుసాహేబు బిరుదము నొసంగిరి.

కీర్తిశేషు లయిన దివాను బహదూర్ వి. నాగమయ్య గారు:—నాగమయ్య గారు ఆంధ్రనియోగిబ్రాహ్మణులు. తిరునల్వేలి జిల్లాయందలి తామ్రపర్ణీ నదీతీరమునఁ గల వీరరాఘవపురము వీరి జన్మస్థానము. వీరు 1850-వ సంవత్సరము డిసెంబరు నెలలో జననమంది యిరువది సంవత్సరము లయినను నిండక పూర్వమే చెన్నపురి విశ్వవిద్యాలయపు బి. యే. పరీక్షలో కృతార్థు లయిరి. వీరు కొంత కాలము మహారాజా గారి యున్నతకళాశాలయందు ఆంగ్లభాష, చరిత్ర గణితశాస్త్రము మొదలగువానిని బోధించు పండితుఁడుగ పని చేసి దివాను సర్ టి. మాధవరావు గారి కాలములో తహాశ్శీలుదారు పదవికి నిరోగింపఁబడిరి. తమ బుద్ధివిశేషముచేతను వ్యవహారజ్ఞానము చేతను కొలఁది కాలములో దివాను పేష్కా రుద్యోగమును పొంది అప్పుడప్పు డయిదు పర్యాయములు దివానుగఁ గూడ పనిచేసిరి. వీరికి రాజకీయవ్యవహారములందుఁ గల నిపుణతను బ్రిటిషు ప్రభుత్వము వారు గ్రహించి దివాను బహదూరు బిరుదము నొసంగిరి. ఈయన జనాభా లెక్కలు తయారుచేయుటకై నియమింపఁబడి తన పనిని కడు శ్లాఘనీయముగ నెఱవేర్చెను. లండను నగరమున నున్న చరిత్రకారుల సంఘమువారు వీరిని తమ సంఘమునం దొక సభ్యునిఁగ చేర్చుకొని గౌరవించిరి. మహారాజు గారి యానతి చొప్పున 1904-వ సంవత్సరమునం దారంభించి రెండు సంవత్సరములలో తిరువాన్కూరు దేశ సంగ్రహచరిత్ర మను మూఁడు సంపుటముల మహాగ్రంథమును ఆంగ్లభాషలో రచించిరి. వీరి పూర్వులు కృష్ణాతీరవాసులు, బాపట్లకడి గ్రామవాస్తవ్యులు. వీరు 1916-వ సంవత్సరము జూను నెలలో ఆకస్మికముగ నే రుగ్మతయు లేకయే మరణించిరి.

బొల్లాప్రెగడ గోపాలరావు గారు:—వీరు చేయుచున్న చికిత్స చాల జయప్రదముగ నున్నది. వీరు క్షయ, కలరా, మశూచి, కుష్ఠువు మున్నగు రోగములను ఆంగ్లేయవైద్యులు నిరాశ చేసికొనినవానిని కుదిర్చి మెప్పు గాంచుచున్నారు.

గంటి లక్ష్మీనరసింహము గారు:— విజయనగరము సంస్థానములో చీఫ్ ఇంజనీయరుగా నున్నారు. అనుష్ఠానిక సంఘ సంస్కర్తలు. తాము వంగకన్యను పెండ్లియాడుటయేగాక, తమకూతును హిందూస్థానీ జమీందారున కిచ్చి పరిణయము చేసిరి.

సరస్వతీనికేతనము, గుంటూరు:—ఈ విద్యాలయము గుంటూరులో వేశ్యకులమునకు చెందినబాలురకు విద్యగఱపు స్థలము. ఈ విద్యాలయనిర్వాహకులు వేశ్యకులోద్ధరణమునకై గట్టిగా పాటుపడుచున్నారు. వారి స్త్రీలకు పెండ్లిండ్లుచేయించుచున్నారు. ఈ వేశ్యసంఘసంస్కరణోద్యమమును నలుదిశల ఆంధ్రదేశమున వ్యాపింపజేయుటకై ఈ విద్యాలయములో చదువువారు కారకులుగా నుండగలరు. ఈ విద్యాలయములో చదివిన బాలురకు గుంటూరు మిషన్ కళాశాలలో చదువుకొనుటకు ఈ నిర్వాహకులు సౌకర్యములను కల్గించుచున్నారు. పటమునందున్న కొంతమంది వేశ్యబాలురులు వారములను చేసికొని తినుచు కష్టపడి చదువుచున్నారు. ఒక పఠన మందిరము వీరిచే తెఱవఁబడి మంచిపనిని చేయుచున్నది.

ఎం. వి. భాగ్యలక్ష్మీ వర్మ:— బెజవాడలో జరిగిన మొదటి పంచమమహాసభకు అగ్రాసనాధిపత్యమును వహించిరి. ఈయన పంచముల యభ్యుదయమునకయి నిజాము రాష్ట్రములో అమితముగా పాటుపడుచున్నారు.

హిందూ దేశరక్షక సైన్యపు వసతిగృహము:—ఇది తిరుచినాపల్లిలో నున్నది. ఇచ్చటనే ఇండియన్ డిఫెన్సు ఫోర్సులో చేరినవారికి శిక్ష గఱుపబడుచున్నది.

సర్ బర్నార్డు హంటరు మదరాసు బ్యాంకున కధ్యక్షుఁడు. సి. ఐ. ఎస్. సెల్లి చెన్నపురి ముఖ్య ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుగా నుండెను. ఇప్పుడు తిరిగి పోలీసుశాఖలో పని చేయుచున్నాడు. టి. రిచ్మాండు గారు యూరోపియనుల పక్షమున చెన్నపురి శాసనసభకు ప్రతినిధి. సర్జన్ జనరలు గిఫర్డు చెన్నపురి రాజధానికంతకు సర్జన్ జనరలు. సుబేదార్ అజీంఖాన్ తిరుచినాపల్లిలో దేశీయ రక్షకసైన్యమునకు కవాతు నేర్పుచున్న ఉద్యోగియులలో నొకఁడు. గా. బార్బరు గారు కాఫీ, టీ, రబ్బరు మొదలగు తోటల యజమానులు, యూరోపియనులపక్షమున చెన్నపురి శాసనసభలో ప్రతినిధి.

యుస్తోపాఫ్, గుచికాఫ్, సెజోనాఫ్:—వీరు రష్యా చక్రవర్తిగారి దినములలో వారిక్రింద మంత్రిత్వము చేసినవారు.

భోరుగారు, ఐ. సి. ఎస్.:— మహారాష్ట్ర క్రైస్తవులు. కొల్హాపూర్ దివానుగానున్నారు.

జె. సి. ఆడంగారు:— చన్నపురి ఛీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుగారు.

బియర్డ్సుమెల్లుగారు:—మదరాసు నగరమున కీసంవత్సరము షెరీఫ్ గా నియమింపబడిరి.

కృష్ణనాయరు గారు:—తిరువాన్కూరు దివానుగారు.

జనరల్ స్మట్సు:—దక్షిణాఫ్రికాయుద్ధములో ఇంగ్లీషు వారితో పోరి సంధియయినతరువాత వారిపాలనము నంగీకరించి దక్షిణ ఆఫ్రికాసామ్రాజ్యమునకు రెండవమంత్రి యయ్యెను. తూర్పుఆఫ్రి

యుద్ధములో జర్మనుల నోడించి రూపుమాపెను. ఇప్పు డీయన లండనులో యుద్ధమంత్రికూటములో నొక్కరుగా నుండి పనిచేయుచు గొప్పగొప్పయుపన్యాసము లప్పుడప్పు డొసంగుచుండును.

సర్ ఎడ్వర్డు మారిస్ న్యూఫౌండ్‌లాండు ముఖ్యమంత్రి, సర్ జోసెఫ్ వార్డు న్యూజిలాండు ముఖ్యమంత్రి, వాల్టరు లాంగు అధినివేశములన్నింటిపయిని లండనులో నుండు జార్జి చక్రవర్తిగారి మంత్రి.

ఆస్టిన్ ఛేంబర్లేనుగారు ఇండియా స్టేటు సెక్రటరీగా నుండిరి. డబ్లు మాసేగారు న్యూజిలాండు మంత్రులలో నొక్కరు. బెత్మన్ హాల్వెగ్గు గారు జర్మనీకి ప్రధాన మంత్రిత్వమును జేసెను. రాబర్టు లాన్సింగు గారు అమెరికా సంయుక్తరాష్ట్రములకు విదేశ కార్యదర్శి. జోసెఫ్ వానియేల్సు, న్యూటను బేకరు గార్లు అమెరికా మంత్రులు. జరార్డుగారు జర్మనీలో యుద్ధకాలమందున్న అమెరికా దేశపుమంత్రి.

రష్యా విప్లవనాయకులు:— జారుగారిని నిర్బంధితుని చేసిన సేనాధిపతి. బోబ్రియాటిన్, షింగరీఫ్, జనరలు బ్రుసిలోఫ్, ప్రిన్సు ఇవోఫ్—వీరందఱును రష్యా చక్రవర్తిని పదభ్రష్టుని చేసిన ముఖ్యులలో కొందఱు.

ఎం. రాడ్జియాన్కో:— ఈయన రష్యాపార్లమెంటగు డ్యూమా కధ్యక్షుడుగా నుండి రష్యా చక్రవర్తిని పదభ్రష్టునిగా జేసిన దినములలో ఆయనతో రాయబారములు జరిపిన ప్రజాప్రతినిధి; అతి దేశాభిమాని; ప్రజాహితవాది.

రాస్పుటిన్:— ఇతను ఇంద్రజాలికుడు. రష్యా చక్రవర్తిని చక్రవర్తినిని తనచేతిలో నుంచుకొని కీలుబొమ్మలవలె వారి నాడించెను. జర్మనుల పక్షమున నుండి సంధికయి బహువిధముల యత్నించెను. వీనిదుర్మార్గములను సహింపజాలక రష్యా రాజసంతతిలోని వారగునొకరు తమయింటికి పిలిచి కాల్చి చంపించి నదిలో పడవేయించిరి. వీడు పోయిన కొన్నిమాసములకు రష్యారాజు సింహాసనమును గోల్పోయెను.

మేడం బ్రెష్కాస్కి:— సైబీరియాకు జారుగారి ప్రభుత్వము క్రింద పంపివేయబడిన యువతులలో నొక్కతె. అతి దేశాభిమానురాలు. ఇట్టి యువతీమణులు దేశభక్తితో పడిన కష్టములవలననే రష్యాకు విముక్తి కలిగినది.

మాన్షియర్ మార్టినో:— ఈయన పుదుచ్చేరిలో ఫ్రెంచి గవర్నరు జనరలు. గొప్పపండితుడు. దేశచరిత్రములందు పాండిత్య మెక్కువ. 1917-వ సం.లో మదరాసు విశ్వవిద్యాలయపు విద్యార్థులు పట్టములను పుచ్చుకొను సమయమున వారికి హితబోధ చేసెను.

ప్రొఫెసరు ఎమ్. ఏ. కాన్డైత్తు గారు, బి.ఏ., ఎల్. ఎల్. బి.:— వీరు సా. వి. కే. రామస్వామయరు గారి పుత్రుడు. సర్ శంకరనాయరు గారి యల్లుడు. 1889-వ సం. జననము. 1909-వ సం. కేంబ్రిడ్జిలో బి. ఏ. పరీక్షయందు కృతార్థులైరి. 1914-వ సం. చెన్నరాజధానీకళాశాలయందు చారిత్రకపండితులుగా నియమింపఁబడిరి. వీరు హిందూదేశరక్షకసైన్యమున జేరి ప్రఖ్యాతి గాంచిరి.

జె. సి. మొలోనీ, ఐ. సి. ఎస్.:— మదరాసు పురపాలక సంఘమున కధ్యక్షుడు.

విక్టోరియా ధర్మపఠనమందిరము, గ్రంథాలయము; చెన్నపురి:— ఈ కార్యనిర్వాహక సంఘసభ్యుల పటములో నడుమ పుష్పమాలికాలంకృతులై కూర్చున్న కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు సంఘాధ్యక్షులు. వారి కుడిప్రక్క కూర్చున్న కార్లమూరి గోపాలరావు పంతులు గారు గ్రంథాలయాధిపతులు; ఎడమ ప్రక్క కూర్చున్న గద్దె రంగయ్యనాయుడు గారు విచారణకర్తలు. కుడిచివరకొనలందు కూర్చున్న రుద్రవరము వేంకటరావు, బి. ఏ., బొడ్డికూరపాటి గోపాలకృష్ణరావు గార్లు సహకార్యదర్శులు. నిలుచున్నవారిలో కుడినుండి (1) గజ్జా రాధాకృష్ణశ్రేష్ఠి (2) పాలూరు కాశీనాథశ్రేష్ఠి (3) కాకరపర్తి జగన్నాయకులు (4) గుడిమూతిము ఆదిరంగము (5) సామి రాధాకృష్ణయ్య గార్లు సంఘసభ్యులు. ఈ గ్రంథాలయపఠనమందిరములు జార్జిటవున్ వరదాముత్తియప్పన్ వీధి 'విద్యాలయ' భవనమందు 1917-వ సంవత్సరము ఫిబ్రవరి మాసమున స్థాపింపఁబడినవి. మునగాల రాజా గారు రావు సాహెబు కలువల కన్నన్ శ్రేష్ఠి గారు మున్నగువారు ఈ సంస్థాపనమునకు పోషకులు. ఈ ధర్మపఠనమందిరమునకు మొత్తముమీఁద ప్రతిదినము ఇంచుమించు 25 మంది వచ్చి చదువుకొనుచుందురు.

లోకమాన్యతిలకుగారి సందేశము:— (కూరుచున్నవారు, ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు)— (1) కస్తూరి రంగయ్యంగారు, హిందూ పత్రికాధిపతి, (2) లోకమాత అనిబెసెంటు, (3) లోకమాన్య తిలకు, (4) కరండికరుగారు, (5) కేల్కరుగారు, కేసరీ మరాఠాపత్రికా సంపాదకుఁడు.

సామి వేంకటాచలము శ్రేష్ఠి గారు:— గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకా అల్లూరు గ్రామము వీరి స్వస్థలము. వీరు చెన్నపురియందలి సామి కృష్ణస్వామిశ్రేష్ఠి గారి స్వీకారపుత్రులు. ఆంధ్రాంగ్లేయములందు మంచి వక్తలు. మాతృభాషాపోషకులు, సంఘసేవాపరాయణులు, ధర్మతత్పరులు, ఉదారస్వభావులు, కార్యశూరులు. ఇదివఱ యార్యవైశ్యమహాసభయం దైచ్ఛికభటనాయకులుగ పని చేసి ప్రశంసాపాత్రులైరి. ఆర్యవైశ్యమహాసభలోను దక్షిణ హిందూదేశవైశ్యసంఘములోను కార్యదర్శులుగా పనిచేయుచున్నారు. ఇటీవల శ్రీకన్యకాపరమేశ్వరీ ధర్మస్థానమం దొక ధర్మకర్తగా నెన్నుకొనఁబడుట వీరి స్వకులగణ్యతకును చెన్నపురాంధ్రసభా సహాకార్యదర్శిగ నెన్నుకొనఁబడుట వీరి యాంధ్రలోకగణ్యతకును ప్రత్యక్ష నిదర్శనములు. వీరు చెన్నపురాంధ్రసభా గ్రంథాలయాభ్యుదయమున కొసంగిన వేయి రూప్యముల విరాళము వీరి దానధర్మములలో ప్రత్యేకించి ప్రశంసింపఁదగినది. వీరి యౌదార్య మాంధ్రమాతృసేవాపరమై యత్యంతఫలవంత మగు ననుటకు సందియము లేదు.

తాతా నాగయ్య శ్రేష్ఠి గారు:—చెన్నపురియందు చిరకాలముగ పేరుపెంపులు గాంచుచున్న వైశ్యకుటుంబములలో వీరి కుటుంబ మొకటి. వీరు గిడ్డంగివీథిలోని గొప్ప గుడ్డల వర్తకులలో నొకరు, దానధర్మప్రియులు, స్వభాషాభిమానులు, ఉదారులు; పింగం సెట్టి యతీంద్రులు సెట్టి గారి ధర్మస్థానమునందలి ధర్మకర్తలలో నొకరు.

కూరపాటి నమ్మాళ్వారు శ్రేష్ఠి గారు:— వీరు చెన్నపురియందలి వైశ్యధర్మస్థానములలో ప్రధానము లగు పప్పుసెట్టి రాఘవయ్యశ్రేష్ఠి గారియొక్కయు పింగంసెట్టి యతీంద్రులు సెట్టి గారియొక్కయు భైసాని మాధవశ్రేష్ఠి గారియొక్కయు ధర్మస్థానములలో మిగుల శ్రద్ధ వహించి పనిచేయు ధర్మకర్తలలో నొకరు. వీరు విద్యాపక్షపాతులు, మంచి వ్యవహారవేత్తలు, పరోపకారపరాయణులు, ఉత్సాహపురుషులు, ఉదారస్వభావులు; గిడ్డంగివీథిలోని గొప్ప గుడ్డల వర్తకులలో నొకరు. ఈవర్తకమునందు వీరికి నిరుపమానమైన యనుభవసామర్థ్యములు గలవు.

చిన్ని మెల్లమంద శ్రేష్ఠి గారు:—పొదిలె తాలూకా గుళ్లసముద్రము వీరి స్వస్థలము. వీరు బాల్యమునుండియు చెన్నపురియందు స్థిరనివాస మేర్పఱచుకొని స్వయంకృషివలన గొప్ప వర్తకులై తమ నిరుపమానగుణసంపదవలన విశేషవిఖ్యాతి గడించి విరాజిల్లుచున్నవారు. వీరు పరమసాధువులు, పరోపకారపరాయణులు, మహోదాతలు, మహనీయులు. నిరంతర ధర్మచింత గల వీరి శక్తి సామర్థ్యసంపదౌదార్యములు స్వభాషాభివృద్ధికిని స్వదేశాభివృద్ధికిని సాధనంబులై వీరి కపరిమితమైన యశంబు నాపాదింపఁగలవని నిరీక్షింపఁబడుచున్నది.

బచ్చు వేంకటసుబ్బయ్య శ్రేష్ఠి గారు:— వీరి స్వస్థలము నెల్లూరు. వీరు చిరకాలము నెల్లూరు పురపాలక సంఘసభ్యులుగ నుండి, 1916-వ సంవత్సరమున నెల్లూరులో జరగిన యార్యవైశ్య మహాసభ కాహ్వానసంఘాధ్యక్షులుగ నుండిరి. వీరు ఆంధ్రమున మంచి వక్తలు. టీ. ఏ. టేలర్ అండ్ కంపెనీ పీస్‌గుడ్స్ మర్చెంట్సు అసోసియేషనును స్థాపించి దాని కార్యదర్శులుగ పనిచేయుచున్న వీరు మంచి వ్యవహారవేత్త లని ప్రత్యేకించి వ్రాయుట యనావశ్యకము. పరోపకారపరాయణు లగు వీరు గిడ్డంగివీథిలోని గొప్ప గుడ్డల వర్తకులలో నొకరు.

పూర సుబ్బయ్య శ్రేష్ఠి గారు:— వీరు గిడ్డంగి వీథిలోని గొప్ప వస్త్రవర్తకులలో నొకరు. వీరి స్వస్థలము ఒంగోలు తాలూకా మణ్ణూరు. వీరికి స్వస్థలాభిమాన మధిక మనుటకు వీ రా ప్రాంతములలో త్రవ్వించిన బావులును పునరుద్ధరించుచున్న దేవస్థానములును జరపుచున్న యితరధర్మప్రతిష్ఠాపనలును ప్రత్యక్షనిదర్శనములు. వీ రెంత యుదారులో అంత గుప్తదాతలు; భక్తాగ్రేసరులు, సర్వమాదాయణులు, ఆశ్రితపక్షపాతులు, మాతృభాషాభిమానులు. వీరి శక్తిసామర్థ్యసంపదౌదార్యములు సంఘసేవాపరములై యాంధ్రాభ్యుదయమున కత్యంతసహకారులై వీరికి శాశ్వతకీర్తిని సమకూర్పఁగలవని విశ్వసింపఁబడుచున్నది.

ముత్తా వేంకటసుబ్బరావు గారు:—వీరు కాకినాడ వాస్తవ్యులు, సుప్రసిద్ధవైశ్యవంశ్యులు. ఐనను, వీరు స్వయంసహాయము వలననే యిప్పటి తమ యున్నతస్థితికి వచ్చినవారు. చెన్నపురిలో బి. ఎల్. పరీక్షయందు కృతార్థులై యిక్కడనే స్థిరనివాస మేర్పఱచుకొని యాబాల్యమిత్రులగు వీ. రాధాకృష్ణయ్య గారితో కలసి న్యాయవాదివృత్తికి కడంగి యద్వితీయ మైన విఖ్యాతి గాంచిరి. ఒరిజినల్ సైడులో పనిచేయు వకీళ్లలో వీరు ప్రముఖు లని ప్రసిద్ధి. వీరంత భక్తిశ్రద్ధలతో తమ ధర్మమును నిర్వర్తించు వకీళ్లు కలగా యనునట్లు ప్రవర్తించుటయే వీరి యౌన్నత్యమునకు ప్రధానసాధన మని ప్రతీతి కలదు. ఇటీవల వీరు సంఘసేవాపరాయణులై యౌదార్యము మీఱ పెక్కు ప్రతిష్ఠాపనలందు పాల్గొనుచుండుట ప్రశంసనీయము. ఇక్కడి యాంధ్రుల కొక విధముగా గౌరవము కల్గించినవారిలో నొకరగు వీరి శక్తిసామర్థ్యౌదార్యములు ఆంధ్రమాతృసేవాపరములై యత్యంతము ఫలించునని నిరీక్షింపఁబడుచున్నది.

కొల్లా వేంకటరాఘవ శ్రేష్ఠి గారు:—అనాదినుండియు చెన్నపురియందలి శ్రీ కన్యకాపరమేశ్వరీదేవస్థానమునకు వివాభావసంబంధము గల వీరి కుటుంబము సుప్రసిద్ధము. వీరి కుటుంబీకులు చిరకాలమునుండి చెన్నపురి వైశ్యులకు కులనాయకులుగా నున్నవారు. వీరు ప్రస్తుతము కన్యకాపరమేశ్వరీదేవస్థానపు ధర్మకర్తలలో నొకరు; విశేషించి యధ్యక్షులు. కాళహస్తి, వడమలపేట తండియార్పేట మున్నగు పుణ్యస్థలములలో వీరి పూర్వులు స్థాపించిన దేవాలయములు వేదపాఠశాల ధర్మసత్రములు మున్నగు ధర్మప్రతిష్ఠాపనలకు వీరే ప్రస్తుతము వ్యవస్థాపకులు. చెట్పేటయందలి వైశ్యవిద్యార్థి వసతిగృహనిర్మాణము సందర్భమున ఒక జంటగది కట్టుటకై వీరొసఁగిన 1,210 రూప్యముల విరాళమే వీరి స్వతంత్రదానధర్మములలో ప్రధానము. ఈ స్వల్పారంభము, దురహంకారకారణము కాక, వీరిని వీరి పూర్వికులవలెనే మహాదాతలను గావించుటకు సాధన మగు నని యూహింపఁబడుచున్నది.

డాక్టర్ నాదెళ్ల వెంకన్న దేవర గారు:—వీరు పాశ్చాత్యవైద్యశాస్త్రవేత్తలు, సుప్రసిద్ధులు; జార్జిటవును నందలి సుసంపన్నములైన కుటుంబములలో వీరికి పలుకుబడి మెండు. ఉదారస్వభావులు, దానధర్మప్రియులు, సంఘసేవాపరాయణులు. పేదసాదలకు ధర్మముగా వైద్యము సేయుటయే కాక, ఆవశ్యకతనుబట్టి పథ్యపానాదులకు కూడ యథోచితసాహాయ్యము సేయుచుందురు! వీరు చెన్నపురాంధ్రసభయందలి వ్యాయామశాఖ కధ్యక్షులు.

నాళము లక్ష్మీకాంతము గారు:—వీరి కుటుంబము కొన్ని పురుషాంతరములనుండి చెన్నపురిలో స్థిరనివాస మేర్పఱచు

గాని పెద్ద యెత్తున వ్యాపారము చేయుచున్నది. వీరి పురుషాంతరములో వీరును ప్రయోజకులుగ ప్రసిద్ధి నొందినారు. వీరు పూర్వాచారపరాయణులు, నిష్ఠాగరిష్ఠులు; వీరి సౌశీల్యము ప్రశంసాపాత్రము.

నాళము వేంకటరత్నము గారు:—వీరు లక్ష్మీకాంతము గారి యనుజులు, రసికాగ్రేసరులు, ఉదారస్వభావులు, భాషాభిమానులు, పరోపకారపరాయణులు.

పేరూరి విశ్వనాథము గారు:—వీరు జగ్గయ్యపేట వర్తకులు; బొంబాయిలోను చెన్నపురిలోను కూడ విరివిగ వ్యాపారమును జరిపిన సుప్రసిద్ధులు. ప్రస్తుతము చెన్నపురి వీరి స్థిరనివాసము. వీరికి స్వభాషాభిమానమును స్వదేశాభిమానమును మెండు. ఉదారస్వభావులును పరోపకారులు నగు వీరి సౌశీల్యము ప్రశంసనీయము.

పింజల సుబ్రహ్మణ్యము శ్రేష్ఠి గారు:— వీరు వేహాంగులు, వేటపాలెము వాస్తవ్యులు. ఇక్కడ చిరకాలముగ లుంగీల వ్యాపారము చేయుచున్నారు. ఉదారులు, దానధర్మప్రియులు, సంఘసేవా పరాయణులు, ఆంధ్రోద్యమాభిమానులు, స్వభాషాప్రోత్సాహకులు. వీరు చెన్నపురాంధ్రసభా ప్రతిష్ఠాపకులలో నొకరు; ప్రారంభమునుండియు లలితకళాశాఖా కార్యదర్శిగ పనిచేయుచు సభాభివృద్ధికై పాటుపడుచున్నారు. ఈనడుమ చెన్నపురియందు సమావేశమైన రాష్ట్రీయ బ్రాహ్మణేతర మహాసభాహ్వానసంఘమునకు సహాయ కార్యదర్శిగ నెన్నుకొనబడిన సుప్రసిద్ధులు.

శ్రీ వత్సవాయ వేంకటనరసింహము రాజు గారు:—సూర్యవంశ క్షత్రియులలో ప్రఖ్యాతి కెక్కిన పెద్దాపుర సంస్థానాధీశులకు సమీప జ్ఞాతులును మొగల్తుఱ్ఱునందలి వత్సవాయ కుటుంబమునకు మూలపురుషు లగు శ్రీ జగ్గరాజ భూపాలునికి మూడవ పురుషాంతరము వారును నగు వత్సవాయ సుబ్బరాజుగారికి వేంకటనరసింహ రాజు గారు రెండవ కుమారులు. వీరి తండ్రి గారి యద్వితీయ వితరణ శీలము సుప్రసిద్ధము. వీ రాయుర్వేదమునందును ఛాయాపట గ్రహణాది చిత్రకళలయందును విశేష నైపుణ్యము నొందినవారు. వీరికి వేటాడుటయం దతి ప్రీతి. ఆయుర్వేదమునందు విశేష నిపుణత నొంది మేహాదిష్టవ్యాధులు మున్నగు నసాధ్యరోగములను 9 దినములలో నివారింప గల యౌషధములను గనిపెట్టి ఖ్యాతి గడించిరి. వీరి మేహరోగౌషధశాల చెన్నపురియందు జయప్రదముగ నిర్వహింపబడుచు, అసంఖ్యాకు లగు రోగుల నాకర్షించుచు. గాక! వీరు బీదల కుచితముగ చికిత్స చేయుటకై యొక ధర్మవైద్యాలయమును స్థాపించుటకు ప్రయత్నించుచుండుట ప్రశంసనీయము.

గజ్జె పార్థసారథి శ్రేష్ఠి గారు :—చెన్నపురియందలి సుప్రసిద్ధవైశ్యకుటుంబములలో వీరి దొకటి. వీరు గొప్ప వర్తకులు, లౌకికవ్యవహారవేత్తలు, ఉదారస్వభావులు, స్వభాషాభిమానులు, దానధర్మప్రియులు. ఇటీవల శ్రీ కన్యకాపరమేశ్వరీదేవస్థానమునకు ధర్మకర్తగా నెన్నుకొనబడినారు. వీరి సాధుస్వభావసంపదౌదార్యములు సంఘసేవాపరములై వీరికి చిరకీర్తి నాపాదింపఁగల వని యూహింపఁబడుచున్నది.

రాయచోటి గిరిరావు పంతులు గారు:—వీరు చిత్తూరు మండలములోని మదనపల్లి వాస్తవ్యులు. గొప్ప విద్యాంగవేత్తలు, జాతీయవిశ్వవిద్యాలయమునకు ప్రధానాంగముగ నుండఁబోవుచున్న కళాశాలను సంస్థాపించిన మహనీయులు. తాము సంపాదించిన విత్తము నెల్ల విద్యాభివృద్ధికి వినియోగించి కీర్తి వడసినవారలు. ఆంధ్ర రాష్ట్రోద్యమమునకు ప్రజల సానుభూతి నొసఁగు దత్తమండల వాస్తవ్యులలో నొకరు. పేద బాలుర పాలిటి పితరులు.

హైందవస్త్రీల లక్ష్మీవిలాససభ:— క్రింది వరుసలోని పేర్లు:—1. కే. పట్టమ్మాళ్; 2. పి. లక్ష్మమ్మ; 3. పి. ముత్తులక్ష్మిఅమ్మాళ్; 4. టి. వి. శేషగిరి అయ్యరుగారి భార్య; 5. ఎం. లక్ష్మిఅమ్మాళ్, (ప్రెసిడెంటు); 6. మాపిళ్లాయ్ మణి మొదలియార్ గారి భార్య; 7. వల్లా సౌందర్యవల్లిఅమ్మ. రెండవ వరుసలో 1. బి. అనుసూబాయి, (జాయింటు సెక్రటరి); 2. పి. మంగరాజమ్మ; 3. మీనాక్షిఅమ్మాళ్; 4. జి. నంగమ్మాళ్; 5. ఎస్. అమ్మణిఅమ్మ; 6. జానకిఅమ్మాళ్; 7. ఆ. చిన్నమ్మ. పైవరుసలో 1. ఎస్. పార్వతిఅమ్మాళ్; 2. కే. తాయారమ్మ; 3. వై. రుక్మిణమ్మ; (జాయింటు సెక్రటరీ) 4. డి. శంగారమ్మాళ్; 5. సి. చెల్లమ్మాళ్.

విస్సా కమలాక్షమ్మ గారు:— ఈమె ముండి వాస్తవ్యులు అన్నమురాజు వరసింహయ్య పంతులు గారి కొమార్తె. నెల్లూరు వకీలు వి. రాజగోపాలు గారి సతీమణి. పసితనమునుండియు స్త్రీసంఘ సంస్కరణమునందును స్త్రీవిద్యాభివృద్ధియందును కడు నుత్సాహము గలిగి మిక్కిలి పాటుపడియె. నెల్లూరునందు వారమున కొకసారి స్త్రీల నందఱ నొకచోట చేర్చి సద్విషయములను ప్రసంగించి కాలము పుచ్చుచుండుట కేర్పాటు చేయుటకై ఈమె చాల పాటుపడి కొంత కాలము అట్లు జరపుచుండెను. స్త్రీలకుఁగాను ఏర్పాటుచేయఁ బడిన పరీక్షలను కొన్నింటిని ఈమె దగ్గఱనుండి జరిపెను. ఈమె మిక్కిలి పసితనముననే అనఁగా 19-వ సంవత్సరముననే ఒక యాఁడు బిడ్డను గని కాలగతి నొందెను. నెల్లూరు మండలమున జరిగిన యాంధ్ర స్త్రీల సభలోని మొదటి తీర్మానము ఈమె వియోగమును గుఱించియే.

జాతీయవిశ్వవిద్యాలయములోని యాంధ్రవిద్యార్థులు:—గతసంవత్సరము జూలయి నెలలో అఖిలభారతీయజాతీయ విశ్వవిద్యాలయమునకు ప్రధానాంగముగ మదనపల్లియందు నెలకొల్పఁబడిన విశ్వవిద్యాలయ కళాశాలయందు ప్రకృతము దేశములోని వివిధప్రాంతములనుండి వచ్చి సుమారు వందమంది విద్యార్థులు చదువుకొనుచున్నారు. అందు ఆంధ్రదేశమునుండి వచ్చిన యువకుల సంఖ్య ప్రోత్సాహకరముగా నున్నది. వారిలో అన్యోన్యప్రేమానురాగము లుండుట కొక సంఘము "ఆంధ్రభ్రాతృసమితి" యను నామమున నెలకొల్పఁబడినది. ఈ ఛాయాపటమున నున్న వారలు:— మొదటివరుస (నేలమీఁద కూర్చున్నవారలు):— హనుమంతప్ప

(బళ్లారి) తాడేపల్లి లక్ష్మీనారాయణ (గుంటూరు) బలభద్రపాత్రుని కామేశ్వరరావు (గుంటూరు) తిరుమలరావు (హైదరాబాదు) వేణుగోపాలరావు (చిత్తూరు) సుబ్బారావు (చెంగల్పట్టు) పేరావధాని (గుంటూరు). కుర్చీలమీఁద నున్నవారు:— ప్రొఫెసరు దేవరకొండ గురుమూర్తి, ఎం. ఎ. (ఆనర్సు), గారు (తత్త్వశాస్త్రజ్ఞులు) ప్రొఫెసరు యదునందప్రసాదు, బి.ఎ. (ఆనర్సు), బి.ఎస్.సి. గారు (ప్రకృతిశాస్త్రజ్ఞులు) ప్రొఫెసరు వెంకటేశ్వరను ఎం.ఏ. గారు (ఆంగ్లపండితులు) చింతామణి ఎస్. త్రిలోకికరు, ఎం.ఏ., గారు ప్రిన్సిపాలు ప్రొఫెసరు రాజగోపాలము, ఎం.ఏ., గారు (రాజకీయశాస్త్రజ్ఞులు) రాయచోటి గిరిరావు, బి.ఏ., గారు (సంస్థాపకులు) ప్రొఫెసరు గద్దమడుగు వేంకటసుబ్బారావు, ఎం.ఏ., గారు (గణితశాస్త్రజ్ఞులు). మూఁడవవరుస (నిలుచున్నవారు):— శ్యామకృష్ణయ్య (బళ్లారి) రామచంద్రరావు (గుంటూరు) వెంకటేశ్వరులు (నెల్లూరు) నరహరినాయుఁడు (నెల్లూరు) నారాయణశాస్త్రి (బళ్లారి) పరమాత్ముని వేంకటరమణయ్య (చిత్తూరు) వేంకటరావు (చిత్తూరు) విశ్వనాథము (చిత్తూరు) బిట్టకవి జగన్నాథరావు (కృష్ణా) రామయ్యరు గారు (సాంకేతికశాస్త్రజ్ఞులు) రామాచార్యులు గారు (సంస్కృతాంధ్రపండితులు). నాలుగవవరుస (నిలుచున్నవారు):— వేంకటసుబ్బు (గుంటూరు) రామారావు (బళ్లారి) ఎల్లారెడ్డి (కర్నూలు) రామానుజులు (చెన్నపురి) నరసింహగుప్త (చిత్తూరు) కోలవల సీతారామయ్య (కృష్ణా) సింగారవేలు (చెన్నపురి) పంపాపతి (అనంతపురము), ఎం. వి. ఎస్. శర్మ (గుంటూరు) శ్యామన్న (మైసూరు) శ్రీనివాసరావు (మైసూరు).

దర్శి చెంచయ్యశ్రేష్ఠి గారు:— వీరు అమెరికాకు 1912-వ సం. లో వెళ్లి ఇంజనీరింగు చదువుకొనిరి. అమెరికాలో నున్నప్పుడు లాహోరు కుట్రకేసులో సంబంధము కలదను అనుమానముమీఁద ఈ రాజధానిలో నిర్బంధితుఁడయి యున్నాఁడు.

సార్జెంటు ఎస్. వి. రెడ్డినాయుఁడు గారు:— ఈయన డిప్యూటీ తహశీలుదారుగా నుండిన సుంకరి ఆళ్వారుదాసునాయుఁడు గారి మూఁడవ కుమారులును తేటు సుంకరి వెంకటరెడ్డి సుబేదారు గారి మనుమలునై యున్నారు. ఈయన వయస్సు 22 సంవత్సరములు. వీరు వివాహమైన కొలఁది దినములలోనే ఈస్టు ఆఫ్రికాకు సైనికుఁడుగా పోవ నిశ్చయించుకొనిరి. వీరు కలకత్తాలో నుద్యోగము చేయుచు బి. యన్. రైల్వే సైనికుఁడుగా చేరి కొలఁది దినములలో కార్పొరల్ పదవి నొందిరి. ఒక సంవత్సరము గడచిన పిమ్మట సార్జెంటుగాఁ జేయఁబడి ఇప్పుడీ పదవియందు జేళమును కొలుచుచున్నారు. వీరు [illegible] విశాఖపట్టణప్రాంతాంధ్ర అడ్వొకేటునకు తూర్పు ఆఫ్రికా సంగతులను వ్యాసములుగాఁ బంపుచుందురు. రెడ్డినాయుఁడు గారు యుద్ధరంగమున నిరంతరముఁ బోర నక్కఱ లేదు. వీరికి తీరుబడి యున్నప్పుడు సంఘసేవకై పాటుపడుచుందురు. చదువురాని యాంధ్రసైనికుల కుత్తరములు వ్రాసి పెట్టుట గాని చదివి వినిపించుట గాని యుద్ధరంగముల ముచ్చటలు చెప్పుట గాని చేయుచుందురు. ఈ సంఘసేవకై నాయఁడు గారు మన యాంధ్రనాయకులను తోడ్పడ మని ప్రోత్సహించుచున్నారు. విశాఖపట్టణమందు యస్. రంగమన్నారు గారు కాకినాడయందు డీ. వీ. యస్. ప్రకాశరావు పంతులు గారు బెజవాడలో అ. వెంకటరమణయ్య పంతులు గారు తమ శక్తి కొలఁది పాటుపడుచు కావలసిన వార్తాపత్రికలు కవరులు కాగితములు మొదలగునవి ప్రోవుచేసి తూర్పు ఆఫ్రికాకు పంపుచున్నారు. నాయఁడు గారు పూనికైన కార్యము సాధించి తిరిగి త్వరలో దేశమునకు వచ్చెదరుగాక!

కీర్తిశేషులైన గుండు వాసుదేవశాస్త్రి గారు:— వీరు 1855-వ సం. ఏప్రిల్ నెల 19-వ తేదిని కృష్ణాతీరమందలి కారుమూరను గ్రామమున జనన మొందిరి. రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజిలో ఎఫ్. ఏ. తరగతి పెట్టిన సంవత్సరమే యా పరీక్షలో వీరు తీర్ణులైరి. ఆ మఱు సంవత్సరమే రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటులో ప్రవేశించి విశాఖపట్టణము గోదావరీ కృష్ణా గుంటూరు నెల్లూరు ఉత్తరార్కాటు జిల్లాలలో సుప్రసిద్ధముగ ముప్పది సంవత్సరములకు పైఁగా జిల్లా రిజిస్ట్రారు పని చేసి మొదటి గ్రేడు రిజిస్ట్రారుగా నుపకారవేతనము పొంది గుంటూరు తాలూకా బోర్డు ప్రెసిడెంటుగ నుండి యరువది రెండవయేఁట అనఁగా 1916-వ సం. మే నెల 9-వ తేదీని కాలధర్మము నొందిరి. వీరి సమర్థతకు వీరిపై అధికారులకుఁ గల నమ్మకమును ప్రజానురాగమును నిదర్శనములు. వీరిది పండితవంశము. వీరు కవులు. పండితాభిమానము కలవారు. వీరి కాంధ్రగీర్వాణహూణభాషలందు నిష్కళంకప్రజ్ఞ కలదు. వీరి మేనకోడలై వీరిచే నభివృద్ధికి వచ్చినవారే కవయిత్రియు విదుషియునైన గుండు అచ్చమాంబ గారు. పెక్కండ్రకు వీరు విద్యాదానము గావించిరి. వీరు నిక్కమైన స్వదేశాభిమానము కలవారు. అద్వితీయమై నిష్కళంకమైన నడవడి గలవారని యాంధ్రులచే మెప్పు వడసిన వారు.

నెనగపల్లి రామస్వామి గుప్త గారు:— వీరు గుంటూరుజిల్లాలో రాజకీయవిషయములలో కాంగ్రెసు పుట్టిన నాటి నుండియు పని చేయుచున్నారు. కాంగ్రెసు పార్టీకి చెందినవారు. గుంటూరుమండల సభను మొట్టమొదట స్థాపించిన వారలలో నొక్కరు. హిందూదేశమందలి మండల సభలలో కూడ నిదియే మొదటిది. ఇటీవల గుంటూరు మండలసభా సంచార కార్యదర్శిగ పనిచేయుచు పెక్కు గ్రామసంఘములను కూడ స్థాపించిరి. ఆర్యవైశ్యసంఘోద్ధరణము కొఱకయి గట్టిగా పని చేయుచుందురు. 'ఆర్యవైశ్య' పత్రికా సంపాదకులు. ఏలూరులోను గుంటూరులోను నాగ యంత్రములను స్థాపించుటకు వీరే కారకులు. గుంటూరుజిల్లా రాజకీయజీవితమునందు ప్రథమస్థానము నలంకరింపఁదలచినవారిలో గుప్తగారొక్కరనుట నిస్సందేహము.